# నవకథామంజరి



కర్త

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

పబ్లిషర్సు

పిఠాపురము ఎస్టేటు కోఆపరేటీవు స్టోర్సు

పిఠాపురము — తూ॥ గోదావరిజిల్లా.

వెల రు 1—0—0

# విషయసూచిక.

# కృతి

తే. గీ. శ్రీల నరసన్నపేటను జెలఁగె వైశ్య
కులుఁడు పాట్నూరు గడ్డెయ్య, కూర్మి నతని
పుత్రుఁడైన శ్రీస్వామిబాబునకు నేను
నవకథామంజరి నొసఁగినాఁడఁ గృతిగ.

# ఉపోద్ఘాతము

స్వదేశ స్వజాతి స్వసంఘాచారాదులఁ దెలిసికొనుట ప్రతివ్యక్తికి నత్యావశ్యకము. ఇట్లు తెలిసికొనుటచేతనే దేశాభిమానము, జాత్యభిమానము, కలిగి పురోభివృద్ధికి హేతువగును. కాని మనదురదృష్టవశమున ననేకేతరపరిపాలక పరిపాలితుల మగుటచే నన్యజాత్యాచారములు, విద్యలు, స్వసంఘమునఁ బ్రవేశించి, యేది స్వజాత్యాచారమో, యేదిపరజాత్యాచారమో తెలియకుండఁగ వ్యవహరింపఁబడుట కలుగుచున్నది. ఇదులకుఁ గొంత పరజాతి విద్యాభ్యాసముకూడఁ దోడగుచున్నది. 'స్వాచారములలోఁ గొన్ని దేశకాల పరిస్థితులచే నయుక్తములుగాఁ బరిగణింపఁబడుటయుఁ, బరాచారము లాచరణయోగ్యములై యుత్తమములుగా నుండుటయు, స్వాభావికము. నేనిపుడు వ్రాసిన "నవకథామంజరి" లోని గాథలు కొంతవఱకుఁ బ్రాచీనభారతీయచరిత్రను—అందు ముఖ్యముగా నాంధ్రులచరిత్రను—వెల్లడి చేయఁగలవు. ఆయా గాథలలోని ముఖ్యాంశములఁగూర్చి క్లుప్తముగా నిట వివరించుచున్నాను.

## మొదటి కథ (ఆంధ్రులదాయాదుఁడు)

ఈకథకు 'ఐతరేయబ్రాహ్మణము, ఋగ్వేదప్రథమ మండలములోని కొన్ని సూక్తములు" నాకాధార మైనవి. ఈగాథ నేనింతకుముందు (1937 సం॥లో) వ్రాసిన 'రాజసూయరహస్యము' లోనిదానిలో స్వల్పము లగు నంశములను మాత్రము మార్చి యిందుఁ గూర్చితిని. ఈకథవలనఁ బ్రాచీనకాలమునఁ జేయఁబడు 'రాజసూయయాగము' మతవిషయకమై, నాఁడు ప్రశంసనీయమైనను నేఁటివారి కది ఘోరకృత్యముగాఁ గాన్పించును. అందువల్లనే కాలాంతరమున నారాజసూయాది హింసాత్మకయజ్ఞములు ప్రభువులచేతను, బ్రజలచేతను మానివేయఁబడెను. "నరమేధయాగము"న నన్నిసంఘములనుండియు స్త్రీలు, పురుషులుఁగూడ 184 మంది యూపస్తంభములకు బంధింపఁబడుచు రనుట కంటె నేఁ డేది ఘోరతమ మగు కార్య మగును?

ఆనరమేధయాగము నీకలియుగమునఁ గడపటిసారి యొనర్చిన మ

హారాజు విష్ణుకుండినవంశములోని 'రెండవమాధవవర్మ.' (క్రీ॥శ॥ 560-615 సం॥రము) ఈయంశ మాతని మనుమఁడగు 'ఇంద్రభట్టారకుని' శాసనముచేఁ దెలియనగును.

నరమేధయాగపుటంశములు గల 'తైత్తిరీయబ్రాహ్మణభాగము'ను పిశాచములు పోవుటకుఁ బిశాచగ్రస్తులకడ 'పారాయణము' చేయించుట కలదు. 'సున్నాలపన్నము' అను తైత్తిరీయ బ్రాహ్మణభాగము (3-4)లోని "బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే" మొదలగు హననక్రియా వాక్యములచేఁ బిశాచములు జడిసి పారిపోవునని పూర్వులనమ్మకము. నరమేధయాగక్రియవంటిదే రాజసూయములోని 'రాజవిశసనము' నగు మనుష్యపశువిశసనమునఁ జేయఁబడువిధులు. 'విద్యారణ్యభాష్య'మునను, శ్రీమద్రామాయణమునందలి బాలకాండములోని శునశ్శేప గాథలోను, దానివ్యాఖ్యలలోను జూడనగును. 'శునశ్శేపుఁడు' దేవరాతుఁడు' అను నామాంతరము గల వానివలననే మనయాంధ్రజాతి శాపతప్తమయ్యె నను నంశమే యీకథలోని ముఖ్యాంశము. ఆంధ్రు లార్యఋషుల యాశ్రమప్రాంతముల నుండు ననార్యు లనియు, వారు పుళింద, శబ, రాదులలోనుండు నొకతెగవారనియుఁ, గాలాంతరమున వారధికులై మహాసామ్రాజ్యమును నిర్మించిరనియుఁ గొందఱును, ఆంధ్రు లార్యేతరులు కారు, ఆర్యులే, వారార్యావర్తమున గంగా యమునా నదీ ప్రాంతములనుండి యెపుడో యేదారినో దక్షిణహిందూదేశమునకు వచ్చి రాజ్యస్థాపన మొనర్చిరని మఱికొందఱును, ఆంధ్రు లార్యులేకాని, వారి ప్రాచీనస్థానము కృష్ణా, గోదావరీనదీ మధ్యభాగమే యనియు, అచటనుండి మహారాష్ట్ర, ఘూర్జరాది దేశములను జయించి యేలిరని వేఱుకొందఱును, వాదోపవాదము లొనర్చుచు, ఖండన మండనములఁ జేయుచున్నారు. ఆంధ్రులఁగూర్చి చెప్పినప్రాచీన గ్రంథము 'ఐతరేయబ్రాహ్మణము', పిమ్మటివి పురాణశాసనాదులు; కాన నాదిదగు నైతరేయబ్రాహ్మణ మేమి చెప్పుచున్నదో పరిశీలింతము.

1 "ఆవిశ్వామిత్రునకు నూర్గురుపుత్రు లుండిరి. వారిలో 'మధుచ్ఛందుని' కంటెఁ బెద్దవా రేఁబదిమందియుఁ, జిన్నవా రేఁబదిమందియు నైరి. అందులోఁ బెద్దవారగు నేఁబదిమందియు క్షేమమును బొందరైరి. (శునశ్శేపుని జ్యేష్ఠునిగా నంగీకరించి దాయభాగమిచ్చుట కిష్టపడనందున) అట్లు కుశలము నొందని 'ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పుళిందులు, మూతిబులు' నను నైదు తెగలవారిని గూర్చి విశ్వామిత్రుఁడు మీరు ప్రజాభక్షకు లగుదురుగాక అని శపించెను. అట్లు శప్తులగువారు దస్యులలోఁ బెక్కండ్రైరి.

(మధుచ్ఛందునికంటెఁ జిన్నవారగు, అష్టక, రేణుక, ఋషభ' అనుసంఘములలోని నేఁబదిమందియు, శుభసుఖముల నొందిరని 'మైతిరేయబ్రాహ్మణము' లో నీవాక్యముకంటెఁ బూర్వవాక్యముననే జెప్పఁబడెను) ఈకథయే వాల్మీకిరామాయణమున నిట్లు స్వల్పభేదముతో నుడువఁబడెను.

విశ్వామిత్రుఁడు తాను దప మాచరించు 'శరావతీ' నదికి దక్షిణప్రదేశమునందు 'త్రిశంకునకు' సశరీరస్వర్గ మిప్పింప యత్నించి యది నెఱవేఱక విఘ్నము నొందగా విచారించి యాప్రదేశమును విడిచి పశ్చిమాభిముఖుఁడై 'పుష్కర' తీర్థముఁ జేరి యటఁ దప మొనర్చుచుండెను.

---

1 ఆపస్తంబీయులు శ్రాద్ధక్రియ లొనర్చుటలో 'భరద్వాజ' సూత్రముల ననుసరింతురు. ఆపస్తంబుఁడు, తన శిష్యుఁడగు భారద్వాజునిచే నంత్యేష్టిక కర్మసూత్రములను రచింపఁజేసె నని పెద్దలు చెప్పుదురు.

1 తస్యహ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః పంచాశ
దేవ జ్యాయాంసో మధుచ్ఛందసః పంచాశత్కనీయాంస
స్తద్యే జ్యాయాంసో న తే కుశలం మేనిరే, తాననువ్యాజహా
రాంతా న్వః ప్రజా భక్షీష్టేతి.
తఏ 'తేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా' మూతిబా ఇత్యుదం
త్యా బహవో భవంతి వైశ్వామిత్రాదస్యూనాం భూయిష్ఠాః॥
ఐతరేయబ్రాహ్మణ, 7-3-18.

[1] ఆకాలముననే యయోధ్యాధిపతి యగు 'అంబరీషుఁడు' యజ్ఞ మొనర్చుచుండఁగ నాతని యాగపశువు నింద్రుఁ డపహరింప రాజపురోహితోపదేశముచే, నరపశువుకై యత్నించి 'శునశ్శేపుఁడు' అను వానిని గొని తెచ్చుచు మార్గమధ్యమునం దుండిన విశ్వామిత్రాశ్రమమునందు విశ్రాంతి పొందుచుండఁగా, 'శునశ్శేపుఁడు విశ్వామిత్రునిం జేరి తన వృత్తాంతముఁ జెప్పి, నన్ను రక్షింపుమనెను. విశ్వామిత్రుఁడు శునశ్శేపుని రక్షింతునని మధుఛందాదులగు తనపుత్రులలో నొకనిని శునశ్శేపునకుఁ గాను, నంబరీషుని యజ్ఞమునకుఁ బశువుగాఁ బొండన, వారామాటలకు రోసి "శ్వమాంసము" దినుటవంటిమాటను జెప్పితిరి. దీని నెట్లుఁ జేయఁగల మన, నామాట కెదు రాడితిరిగాన మీరు కుక్కమాంసమునే దినుచు వేయివత్సరములు ప్రవర్తింతురుగాక! యని శపించెను. శునశ్శేపునకు రెండుమంత్రముల నుపదేశించి వీనిని జపించితివేని దేవతలు నిన్ను 'యూపస్తంభమునుండి' విడిపింపఁగలరని చెప్పి పంపెను.

పై గాథాంశములఁ బరిశీలింపఁగా విశ్వామిత్రుఁడు తనపుత్రులగు నూర్వురను 'పుష్కర' తీర్థమునఁ దపం బొనరించుకాలమున శపించెనని స్పష్టమగును. కాన, నాంధ్రుల యాదిమస్థలము పుష్కరతీర్థమే. వేదవాక్యమువలన నాంధ్రాదు లేఁబదిమందియే శప్తులైరని కలదు కాని, రామాయణగాథవలన వైశ్వామిత్రులు నూర్వురు, వేయివత్సరములే శాపబాధ నొందువారుగా శపింపఁబడిరని కలదు. ఇది నిజమై యుండును. కారణ మేమనఁగా నెట్టిశాపమునకైనను, ఏనాఁటికైనను శాపవిముక్తి కలుగుట శపించినవా రనుగ్రహించుటచేతనో, శప్తవ్యక్తి యొక్క తపశ్చరణాదులచేతనో నగుట సర్వసాధారణము.

కాన, నాంధ్రాదులును గాలాంతరమున శాపవిముక్తులై యౌన్నత్యము నొందియుందురు! శప్తుఁ డగుఁ మధుఛందుఁడు ఋగ్వేదమహర్షులలో నగ్రగణ్యుఁడు. ఆతనిసూక్తములు, మంత్రములు, పెక్కులు

---

1 అంబరీషునకు 'హరిశ్చంద్ర' నామముకూడ నుండెనని రామాయణవ్యాఖ్యాన వ్రాసెను. మాకథ శ్రీమద్రామాయణము బాలకాండమున 60 సర్గలోఁ గలదు.

ఋగ్వేదమునం గలవు. మధుఛందుఁడు గాక యితనికంటెఁ బెద్దవారే శపింపఁబడిరను వాదము నంగీకరించినను, పుండ్రజాతిజుఁ డగు పౌండ్రక వాసుదేవుఁడు శంఖ, చక్రాదిచిహ్నములను ధరించి శ్రీకృష్ణు నంతటి వానిని డీకొనఁ గల్గెను. శబరులలోనె తాంత్రికవిద్య (శాబరము) వృద్ధి నొందెను. పూర్వమీమాంసా సూత్రములకు భాష్యము వ్రాసినయా తఁడు తాను "శబరస్వామి" యని వ్రాసికొనుట గౌరవాస్పదముగానే తలఁచెను. ఆంధ్రులవ్యాపక ప్రవర్తనగౌరవాదులు ఆపస్తంబునికథావం దర్భమున వివరింపఁబడును.

## రెండవకథ (త్రిలింగదేశపు మహారాణి)

ప్రసిద్ధివహించిన కాకతీయసామ్రాజ్యమునందు 'రుద్రాంబ' దుష్టశిక్షణ, శిష్టపరిపాలనాదులలో దక్ష యని, యనేకగాథలు దేశదేశముల వ్యాపించి యున్నవి. ఈగాథలో రుద్రాంబ యెట్లు 'కంటకి' పరిశోధన మొనర్చి ప్రజాపరిపాలనము చేసెనో, సంసారుల కిక్కట్టులుఁగూడ నెట్లు లేకుండఁగ నొనర్చెనో, సుస్పష్టముగాఁ జెప్పఁబడెను. కథలోని యంశములను 'శ్రీమాడపాటి హనుమంతరావు' పంతులుగారింపుగా భాషాప్రవృత్తితోఁ జిత్రించి యున్నారు. నవకథామంజరిలోని తొమ్మిదిగాథలలో నీకథయు, 'వరరుచి' గాథయు, మత్కృతకములు గాకుండినను, హృదయంగమము లగుటచేతను, విడువరాని వగుటచేతను వారి యనుమతిపై నిందుఁ జేర్చితిని.

## మూఁడవకథ (ఆంధ్రపిత)

లోకమునం దొక్కొక్కజాతికిని, జాతియందలి భిన్నసంఘముల కును వేర్వేఱు సాంప్రదాయము లుండును. అవి-కన్ను-ముక్కు-తల మొదలగు నవయవరూపముల వంటివిగాక 'పితృపితామహ, ప్రపితామహ' వాదులవలన, 'అనూచానముగా' సంప్రాప్తమైన ,నిత్యనైమిత్తిక గృహ్య కర్మములు. వీనిచే నేజాతియో నిర్ణయించుట సులభము. స్వజాత్యభివృద్ధికై యాజాతి సాంప్రదాయముల నేర్పఱచిన మహామహులఁ దాజాతికిఁ బిత యనుట యుక్తము కాదా ? కారణ మేమన, తండ్రి బిడ్డలపు

రోభివృద్ధిఁ గోరి వివాహాదిక్రియలఁ జేయించినట్లే, జాతికిఁ బిత యగు నాతఁడును స్వసంఘాభివృద్ధికై యెన్నియో నిత్యనైమిత్తిక, క్రియాకలాపవిధుల నేర్పఱచును. అందుఁ గొన్ని దేశకాలపరిస్థితులచే మారుట స్వభావ మని మున్నే చెప్పితిని. పై కారణములచే నాంధ్రపిత యెవ్వఁడో యాతని నివాసాదు లెక్కడివో విమర్శింపవలసి యున్నది. వైశ్వామిత్రు లగు నాంధ్రులలోఁ బ్రాచీనయుగముననే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, సంఘము లేర్పడెను. పై నాల్గు సంఘములకు–గృహ్యకర్మములలో–ముఖ్యములగు (1) వివాహశ్రాద్ధకర్మములు మాత్రమే నేటికిని నిలిచి, ఆపస్తంబమహర్షి చెప్పినవిధుల ననుసరించి, సమంత్రకముగానో, అమంత్రకముగానో చేయఁబడుచున్నవి. అతనివిధుల ననుసరించియే కర్మము లొనర్చి యాంధ్రుల మగు మన మభివృద్ధి నొందితిమి గాన మనకాతఁడు పిత. అట్టి మనయాంధ్రజాతియొక్క పిత, విశ్వామిత్ర క్షేత్రమగు 'పుష్కర' తీర్థమునకు సమీపమున నుండవలెనుగదా ?

విశ్వామిత్రబహిష్కృతులగు నాంధ్రులు పుష్కర తీర్థమునుండి నానాదిశలకుఁ బోయినపిమ్మటఁ గొందఱు ఆరావళీ పర్వతశాఖగా దలంపఁబడు "పారియాత్ర" పర్వతప్రదేశమును జేరిరి. "అందుచేతనే పారియాత్రమున" నాంధ్రు లుండిరని కూర్మపురాణమునం గలదు. కొందఱు 'కరూశ'దేశమును, బ్రవేశించుటచే నాంధ్రుఁడగు చాణూరుఁడు కరూశమున జన్మించె నని హరివంశమునఁ గలదు. మల్లుఁ డగు నాచాణూరుఁడే కంసునిచే శ్రీకృష్ణుఁ జంపింప రప్పింపఁబడి శ్రీకృష్ణునిపైఁ బురికొల్ప శ్రీకృష్ణుఁడు వానిని జంపెననియు హరివంశముననే గలదు. (కరూశదేశము గంగా నదీ పరిసరమునందు అయోధ్యా, మిథిలాపురీమార్గ మధ్యమున నుండెనని శ్రీమద్రామాయణములోని బాలకాండ మునఁ గలదు.) శూద్రుఁడు భృత్యుఁ డు నైన సింధులుఁడను నాంధ్రుఁడు, మగధ దేశపాలకుఁడు, కాణ్వాయనుఁ డు నగు

---

1 ఆపస్తంబీయులు శ్రాద్ధక్రియ లొనర్చుటలో భరద్వాజ సూత్రముల ననుసరింతురు. ఆపస్తంబుఁడు, తన శిష్యుఁడగు భారద్వాజునిచే నత్యేష్టికకర్మసూత్రములను రచింపఁజేసె నని పెద్దలు చెప్పుదురు.

'సుశర్మ' యను 'బ్రాహ్మణరాజుం' జంపి యారాజ్యము నాక్రమించెనని 'విష్ణు, వాయు, మత్స్య, భాగవతాది, పురాణములు చెప్పుచున్నవి.

పైకారణములచేఁ బ్రాచీనకాలమున నాంధ్రు లార్యావర్తనివాసులేగాని నేఁటి యాంధ్రదేశవాసులు కారని తెలియవగును. ఆంధ్రవితయు నచ్చటివాఁడే యగుటలో నాశ్చర్య మేమి ?

ఆంధ్రపిత యగు నాపస్తంబుని విధుల ననుసరించి నేఁటి యాంధ్రావనిలోని "బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర" సంఘములలో నూటికెనుఁబదిమంది వివాహాదివిధులఁ జేయుచున్నారు గాన, ఆపస్తంబుఁ డాంధ్రదేశమున నొక్కెడ జన్మించి యుండు నని కొందఱు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. కాని యాచారిత్రకులే యాపస్తంబుని క్రీ. పూ. 4. 5. శతాబ్దముల నాఁటివాఁడని వ్రాయుచుండుటచే నదియె ట్లపొసఁగును? ఏలయన దేని నిపుడు మన మాంధ్రదేశ మనుచుంటిమో యది క్రీ. శ. 2 వ శతాబ్దమువఱకు నాంధ్రసంజ్ఞ నొందలేదు. ఆంధ్రసమ్రాట్టులగు 'శాతకర్ణుల' పాలనముచేతనే యాంధ్రసంజ్ఞ మనయిప్పటియాంధ్రదేశము నకుఁగల్గెను. అది యంతకుముందు "కళింగ, తెనుఁగు, వేఁగి. 1 చోడ, ములక" సంజ్ఞలు కలిగి. యనార్యులగు 'కాళింగ, తెలుఁగు, కోయ, బోయ, చెంచు, లంబాడి, ఎరుక, యానాది, గోసంగి, మాల, మాదిగ" మొదలగువిభిన్నజాతులతోఁగూడి యున్నది.

---

1 'ఛోడ'శబ్దములోని 'డ'కారమును 'ళ'కార సన్నిహితస్థానమునఁ బుట్టునట్లుచ్చరింపవలెను. అట్లే 'కళింగ' శబ్దములోని 'ంగ' 'జ్ఞ' సన్నిహిత స్థానమున నుచ్చరింపవలెనఁట! 'తెలుఁగు, ములక' శబ్దములు 'త్రిలింగ' 'మల్లక'శబ్దభవములు కావనియు, 'తెలుఁగు, ములక' శబ్ద సంస్కృతీకరణమే 'త్రిలింగ, మల్లక' శబ్దము లనియు నవీనపరిశోధకుల తలంపు, ములకనాఁడు ములికినాఁడై, మురికినాఁడు గా నేఁడు ప్రాగాంధ్రుల నోటఁబాస్పదమైనది.

కాలాంతరమున నాయనార్యు లాద్యాంధ్రు లనిపించుకొనిరి. కాని వారి మొదటిభాషయగు, తెలుఁగు ( తెనుఁగు పైశాచీభాషాభేదము ) ఆంధ్రుల సంస్కృత ప్రాకృతభాషలతో మిళితమైయాంధ్రమనికాని తెనుఁగనికాని వ్యవహరింపఁబడెను: భిన్నజాతులొక్కచోటునకుఁ జేరినపుడంతు బలవత్తరమైన జాతియొక్కనామముతోఁ దమజాతికిని-భాషకును- దేశమునకును-పేరు లుంచుకొనుట లోకమునఁ గాంచుచుందుము. ఇది ఇంగ్లండు, అమెరికా, కనడా, మొదలగు దేశముల చరిత్రలఁ జదివినవారికిఁ దెలిసినదే. కాని యిప్పటి యాంధ్రదేశమునం దాంధ్రజాతికంటెఁ దెనుఁగు జాతులవారే హెచ్చుగ 'రాజరాజనరేంద్రుని' కాలమునం దుండుటచే మహాభారతగాథలయందత్యాదరముగల యాప్రభుఁడు నన్నయ మహాకవిని భారతము బహుళసంఖ్యాకులగు తెనుఁగువారికిఁ బ్రీతి గలిగింపఁ దెనుఁగుఁ జేయుమనెను. భారతదేశమున నాఁటికాలమున సంస్కృతమే హెచ్చుగ గ్రంథకర్తలచే వాడఁబడుచుండుటచే నన్నయచేఁ భారతము తెనిఁగింపఁబడుటలో సంస్కృతమే హెచ్చుగఁ జేర్పఁబడెను. దానిఁజూచి యది యాంధ్రీకరణమని (సంస్కృతమెక్కుడై తెనుఁగుతక్కువగుటచే) తిక్కనమహాకవి నన్నయ యాంధ్రకవిత్వవిశారదుఁడనియు నేను తెనుఁగుఁ జేసెదననియు 'విరాటపర్వాదిని' జెప్పెను. ఆంధ్ర తెనుఁగు శబ్దములే సంస్కృత, సంస్కృతేతరభాషలరూపములను స్పష్టపఱచుచున్నవి. 'ఆంధ్రపిత' చెప్పిన 1వివాహాదివిధులు తెనుఁగుజాతులలో లేవు. ఆగుర్తులచేతనే, ఆంధ్ర, తెనుఁగుజాతులఁ దెలిసికొన వీలగును. ఇటీవల గ్రామపురోహితులగు బ్రాహ్మణులు పెక్కండ్రను తెనుఁగుజాతులవారికిని నాంధ్రసాంప్రదాయములచే వివాహాదికర్మము

---

ద్వీపములలో మరికొన్నాటివారు, తెలగాణ్యులు కలరు. నైజాం రాజ్యమున తెలుఁగులనుచు వారు 'ముత్తరాసుల' సన్నిహితులున్నారు ఆంధ్రగ్రంథములలో క్రీ. శ. 13 వ శతాబ్ది వఱకు త్రిలింగశబ్దము లేదు.

లఁజేయించి యాంధ్రత్వము నిచ్చుచున్నారు. ఆంధ్రు లనఁబడు ద్విజుల లోను గాలాంతరము ఆశ్వలాయన, సాంఖ్యాయన, పారస్కర, విఖనసాది' భిన్న శాఖీయులుచేరి తామునునాంధ్రులమే యనిపించుకొనుచున్నారు. 1 మహర్షులలోఁ గొందఱు తమ నివాసాదులను, తాము గ్రంథములను రచించిన ప్రదేశములను దమగ్రంథములఁ బేర్కొందురు. వ్యాసుఁడు భారతమును హిమాలయమున రచించి నటులను యాజ్ఞవల్క్య, పులస్త్య, దేవల' స్మృతికర్తలు, తాము మిథిలాపురి, కురుక్షేత్రము, సింధు నదీతీర ప్రదేశములందుండి, తమస్మృతులఁజెప్పినట్లును నుడివిరి. మఱికొందఱు గ్రంథకర్తలు, స్వస్థలములను స్పష్టముగా జెప్పకుండినను, ఎదియొ తమప్రదేశస్థితిని స్వగ్రంథములలో సూచింతురు. మనుస్మృతికర్త 'గంగా, యమునా' నదులమధ్య ప్రదేశాచారమే యోగ్యమనుటయు, 'కాళిదాస' మహాకవి 'మేఘసందేశ' కావ్యమున 'ఉజ్జయనీనగరము' తా వర్ణించు మార్గమునకు దూరమున నుండినను, యెటులనో కల్పించి దాని నిమిగుల వర్ణించుటయు దీనికి నిదర్శనములు.

---

వివాహకర్మమును వేదోక్తముగానో, పురాణోక్తముగానో, చేయునపుడు బండికాడి రంధ్రమునుండి బంగరు తడిపిన నీరు పెండ్లికూఁతురుపైఁబడునట్లు చేయుట; 'సప్తపదీక్రియా, అరుంధతీ దర్శనము' మొదలగునవియు, మరణానంతరము 'ప్రేతకొనర్చు 'సంచయనము, శ్రాద్ధక్రియలలో బట్టను జందెమునువలెగట్టుకొనుట అన్న (లేక) 'ఆమ శ్రాద్ధాదులు' ఆపస్తంబీయులగు నాంధ్రులలోనె కలవు. తెనుఁగుజాతులలో నట్టిక్రియలు లేక వేర్వేఱు విధులున్నవి.

1మహమ్మదు గజనీదండయాత్రలచే నుత్తరహిందూదేశముల నుండి వెరచి, యానాఁడు కాశీ మొదలగుచోటులనుండి 'ఆశ్వలాయన' సూత్రిసు లీయాంధ్రావనికి వలస వచ్చిరని డాక్టర్. కృష్ణస్వామి అయ్యంగారు వ్రాసి యున్నారు. వారిలో నందవరీకు లనఁబడువారు ముఖ్యులు. అలసాని పెద్దన్న మహాకవి యాశాఖీయుఁడే. 'నంద.వరీక

పై రీతినే 'యాంధ్రిపితే'యుఁ దాను యమునానదీ పరిసరమునం దలి 'సాల్వ' దేశమును, తన గృహ్యసూత్రములలోఁ జెప్పి తన ప్రదేశ మును సూచించెను. దాని కనుగుణముగ నొకమంత్రముఁగూడ 'ఏకా గ్నికాండము'నఁ జేర్చెను. దాని నిట వివరింతును. ౩ ,సీమంతోన్న యన 'కర్మమునందు (గర్భవతియగు స్త్రీకి నాల్గవమాసమునఁ జేయఁ బడు నొకకర్మము) "వీణాగాయకుల నిద్దఱను గానముచేయుఁ డనిపురో హితుఁ డాజ్ఞాపించెను. ఆగానమున ముందు చెప్పఁబోవు రెండు మంత్ర ములలోను మొదటి మంత్రము ,సాల్వ' దేశీయులకు మాత్రమే, రెండవ మంత్రము బ్రాహ్మణు లందఱికి నగును. ఏనదీ సమీపమున వసించు చుందురో యానదిని బేర్కొనవలెను"

ఇందు సాల్వదేశీయుల కొకమంత్ర మాపస్తంబునిచే వేఱుగఁ జె ప్పఁబడెను. చెప్పఁబోవు రెండుమంత్రములలోఁ బూర్వపు మంత్రము 'సా ల్వుల' దని, ఏ యితరగృహ్యసూత్రకర్తయు నీసందర్భమునఁ జెప్పలేదు. అందులకు నిదర్శనముగా 'ఆశ్వలాయన, పారస్కర' గృహ్యసూత్రాం శముల నిందువ్రాయుచున్నాను.

,,సీమను" రాజును గానము చేయుఁ డని (పురోహితుఁడు)

---

చరిత్ర' పైయంశమును వేఱువిధముగాఁ జెప్పుచున్నది. కాని వలస వచ్చుటను మాత్రముస్థి రపఱచుచున్నది. ఆపస్తంబీయులే హెచ్చుమందిగల కొన్నిచోటులను, చాలతక్కువసం ఖ్యగల 'ఆశ్వలాయన' వాజసనేయ, శాఖీయులు తమసూత్రాను సారము కర్మలఁజేయిం చువారు దొరకమి వారును ఆపస్తంబీయులే యగుచున్నారు.

౩. సూ॥ వీణా గాథినౌ సగ్ంశాస్తి

ఉత్తరయోః పూర్వాసాల్వానాం (బ్రాహ్మణానామితరా॥
నదీనిర్దేశశ్చ యస్యాం వసంతి.॥ ఆపస్తంబగృహ్యసూ॥

పటల. 6 ఖండ. 14

ఇద్దఱు వీణావాదకుల కొనతిచ్చును.''

,,సోమరాజు మనుష్యులను రక్షించుగాక ! తమ తమ వృత్తుల లో నే నది ననుసరించి యుందురో యానదిని గూడఁ జేర్కొనవలెను''

1 ''వీణావాదకుల సిద్ధఱను గానము చేయుఁడని యాజ్ఞాపింప వలెను. అం దెవఁడైన నొకఁడు వీరునిగూడ గానముచేయవలెను. మఱి యొకఁడు సోముఁడే మామనుష్యులకు రాజనియు, ఏనది నాశ్రయించి యుందురో దానిని జేర్కొనుచు నీతీరమున నానావృత్తులను నిర్వహింపుచు నున్నారమనియు గాన మొనర్పవలెను.''

ఆపస్తంబుఁడు సాల్వదేశీయుల కని ప్రత్యేకించిన మంత్రము యొక్క యర్థముఁ గనుఁడు.

,'ఓయమునా ! నీతీరమునందు ,సాల్వ' దేశప్రజలు వివిధవృత్తులను నిర్వర్తింపుచున్నవారై (లేక గుండ్రముగఁ దిరుగుచున్నవారై) ,యాగంధరియే మారాజు అని గానముచేయుచున్నారు.''

మాకు సోముఁడే రాజని' యోయమునా! నీ తీరమునందు

---

సూ॥ వీణా గాధినా సగ్ంశాస్తి సీమంరాజానం సంగాయతమితి.।
సోమో రాజాఽవతు మానుషీః ప్రజా విస్తృత్తచక్రాఽసావితి
యాంనదీ ముపవసీతా భవంతి।

ఆశ్వలాయన గృహ్య సూత్ర. 1-15-19

సూ॥ వీణా గాధినా, రాజానగ్ంసంగాయేంతాం, యో
వాస్యన్యో వివతార ఇతి॥ నియుక్తావప్యేకో గాథా
ముపోదాహరతి॥ సోమవివనో రాజేమా మానుషీః
ప్రజా, అవియుక్తచక్రా ఆసీరంస్తే తుభ్యమసావితి ॥
యాం నదీ ముపవసీతా భవంతి ॥

పారస్కర గృహ్య సూత్ర. 1-15

బ్రాహ్మణ ప్రజలు నిర్వర్తించిన పనులు గలవారై గానము చేయుచు న్నారు."

పై మంత్రములలో రెండవ మంత్రమును "సూత్రకారు" లం దఱును జెప్పిరి గాని, మొదటిమంత్రములే సూత్రకర్తయు నుజెప్పలేదు.

1 "పండితసార్వభౌమ, అ. చిన్నస్వామిఃశాస్త్రిగారు" ఇతర సూత్ర కర్త లెవ్వరును జెప్పని సాల్వదేశప్రశంస గలసూత్రమును బురస్కరిం చుకొని ఆపస్తంబుఁడు సాల్వదేశీయుఁడే యగునని. కాని పై మంత్ర మును శ్రీశాస్త్రిగారు గుర్తింపలేదు. 'యౌగంధరిరేవ నోరాజా' అను మంత్రమునుగూడ నాపస్తంబ ప్రోక్తమేయని నాతలంపు. కారణ మే మన, ఆపస్తంబుఁడు వేదర్షియై తైత్తిరీయ సంహితాబ్రాహ్మణములతో 'కాఠకములను' (కఠర్షి ప్రోక్తములగు నెనిమిది కాండములను) ఏకాగ్ని కాండమును గలిపి ప్రత్యేకవేదశాఖ నేర్పఱచి యున్నాఁడు. 2

అందువల్లనే మహారాష్ట్రాదిదేశములలో, 'తైత్తిరీయ' వేదశా ఖను 'ఆపస్తంబ'శాఖ యనియే చెప్పుదురు. ఇంతమాత్రమె కాదు. ఆ పస్తంబునిచేఁ బేర్కొనఁబడిన 'యౌగంధరి' ప్రాచీన యుగములలోని వాఁడు కాఁ డని ముందు నిర్ణయింపఁబడును. మఱియు ఋషులలో 'మంత్రర్షు లనియు కాండర్షులనియు ద్వివిధములుగా మహర్షు లుండినట్లు 'యజుఃకాఠకములలోఁ గలదు.

---

1. చూ. హరిదాస సంస్కృతగ్రంథమాలాప్రచురణమగు ఆపస్తంబగృహ్య
సూత్ర. పీఠిక.

. మంత్రం. యౌగంధరి రేవనోరాజేతి సాల్వీరవాదిషు;
విప్రవృత్త చక్రా ఆసీనాస్తీరేణ యమునే తవ.
సోమవీవనోరాజే త్యాహుర్బ్రాహ్మణీః ప్రజాః
విప్రవృత్తచక్రా ఆసీనాస్తీరేణాసోతవ॥

ఇంతమాత్రమే కాదు. ఆపస్తంబమహర్షియే తనకాలమునందు "బ్రహ్మచర్యవ్రతలోపముచే వేదర్షులు పుట్టుచుండుట లేదనియు, పూర్వకర్మఫలముచే గొందఱుమాత్రము, శ్వేతకేతువువలె నిపుడును జన్మించుచున్నారనియుఁ జెప్పెను. 1

కొందఱు పుట్టుచున్నారు అను కేచిచ్ఛబ్దమును భవంతి అను వర్తమానార్థక క్రియను బ్రయోగించుటచేఁ దన కాలమునందును గొందఱు పుట్టుటను స్పష్టపఱచెను. అక్కొందఱిలో నాపస్తంబుఁడును వేదర్షియెట్లు కాఁడు ?

ఈసందర్భములో డాక్టర్ బుల్హార్ దొరగారు, కేచిత్తు భవంతి అనువాని యర్థవైచిత్రిని గమనింపక ఆపస్తంబుని కాలమునకు వేదర్షుల కాలము దాఁటిపోయిన దని (తమధర్మసూత్రాంగ్లీకరణపీఠికలో) వ్రాయుట చింత్యము. 2

పాణినిమహర్షియుఁ దన యష్టాధ్యాయియందు తేనప్రోక్తమ్ అనుసూత్రము నధికరించి పెక్కండ్రు వేదకర్తల పేరులను నుడివెను. ఇంతమాత్రమేకాదు. కాళిదాస మహాకవియు, వరతంతుమహర్షి మంత్రములఁ జేయువారిలో నగ్రగణ్యుఁ డని తన రఘువంశమహాకావ్యమునఁ గంఠోక్తిగఁ జెప్పియున్నాఁడు.

వేదము పరబ్రహ్మగతమె కాని మహర్షిప్రోక్తము కాదనువారికి పైనిదర్శనములు విరోధించును. కాని ఇందులకు విద్యారణ్యభాష్యనము సాయణాచార్యులవారు కొంత వ్యవస్థ నేర్పఱచి యున్నారు. 3.

---

1. ఆ. ధ. 1-2-5
2. చూ. భట్టభాస్కరకృతమగు పరాయతభాష్యము. 3-6
3. సూ. యజుర్వేద కాఠకములు. 4-1-1

1. డాక్టర్ బుల్హర్ (1880 సం।ర ప్రాంతమున) ఆపస్తంబధర్మసూత్రములను

అదియంతయు నిట వివరింపఁ బనిలేదు గాని, ఆపస్తంబుఁడు యౌగంధరి మహారాజును గూర్చి యొకమంత్రమును రచించె ననుటమాత్రము సత్యదూరము కాదు.

'యౌగంధరి' ఎప్పటివాఁడు ?

బుద్ధునకు సమకాలికుఁడై మగధదేశము నేలుచున్న 'అజాతశత్రు'ని పుత్రికయు, 'దర్భకుఁడు' అనువానికి సోదరియునగు 'పద్మావతి'ని బెండ్లియాడిన 'ఉదయన' మహారాజునకు యౌగంధరాయణుఁడు, అను నాతఁడు మిత్రుఁడు మంత్రియు నై యున్నాఁడు./2. పాణినిమహర్షి తన యష్టాధ్యాయియందు 'గోత్రాపత్య' (కుమారుని తరువాత సంతతి) రూపనివృత్తులఁ గూర్చి చెప్పుచు 'నడాదిగణము' నొకదానిని నుడివియున్నాఁడు. ఆగణమునందు 'యుగంధరశబ్దము కలదు. దానివలన, యౌగంధరాయణ' రూపము కల్గును. యుగంధరునిపుత్రుఁడు 'యౌగంధరి' అనురూపము, అపత్యసమాసవిధిచే నేర్పడునుకాన, యుగంధరపుత్రుఁడు యౌగంధరి, ఆయుగంధరుని మనుమఁడు యౌగంధరాయణుఁడు అగునను టసుస్పష్టము.

ఆయౌగంధరాయణుఁడు బుద్ధునకు సమకాలికుఁ డగుటచే నాతని

---

ప్రసిద్ధికెక్కిన మాక్సుముల్లర్ (1870 సం॥రమున) ఆపస్తంబ శ్రౌతపరిభాషము, ఓల్డెన్ బర్గు ఆపస్తంబ గృహ్యసూత్రములను (1865) ఆంగ్లీకరించిరి. డాక్టరు. వింటర్నిడ్జు ఆపస్తంబ గృహ్యసూత్రములను హరదత్తుని అనాకులా వృత్తితో వియన్నా పట్టణమందు నాగరలిపిలో ముద్రింపించెను. పైనల్వురు జర్మను జాతివారు.

1. యజుర్వేదకాఠకభాష్యము 4-1-1.

(2) ఈయంశము క్రీ. పూ. 6,5, వ శతాబ్దములనాఁటి దని పరిశోధకులు నిర్ణయించిరి. 'భాస మహాకవికృత మగు 'స్వప్నవాసదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణ' నాటకమువల్ల నీగాథ తెల్లమగును.

తండ్రియగు యౌగంధరిని, తన ఏకాగ్నికాండ మంత్రములలోఁ జెప్పిన 'ఆపస్తంబుఁడును' బుద్ధునకు నేఁబది యిరువది సంవత్సరములకుఁ బూర్వపువాఁ డగును. అందువలన నాపస్తంబుఁడు క్రీ॥పూ॥ ఏడవ శతాబ్దపువాఁ డగుట ధృవ మగుచున్నది.

కాని, ఆపస్తంబుని నివాస మేది ?

తనసూత్రములందును, మంత్రమునందును, యమునాతీరమునందలి 'సాల్వ' దేశమును జెప్పుటచే నాతఁ డాసాల్వదేశీయుఁడే యై యుండును. ఇట్లని శ్రీపండితసార్వభౌమ చిన్నస్వామిశాస్త్రిగారు గూడ ధృవపఱచిరి. సాల్వదేశము 'డేరాడూన్' జిల్లాలోని 'జానసర్ బావాల్' అను ప్రదేశమని పండిత జయచంద్ర విద్యాలంకారులు (ఇండియన్ హిస్టరి ఎకాడిమీ సెక్రటరి) నాకు వ్రాసియున్నారు.

పై కారణములచే నేఁటి యాంధ్రదేశస్థుఁడే యాపస్తంబుఁ డను వారివాద మపాస్త మగును. కాని సాల్వదేశమున నుండు నాంధ్రుఁడు మాత్రమనవలయును. ఇందులకుఁ గారణము లింతకుఁ బూర్వమె చెప్పితిని. విశ్వామిత్రుఁ డాంధ్రాదులను శపించిన "పుష్కరతీర్థ" మెచ్చటిది ? ఆంధ్రుల ప్రథమస్థానమగు 'పుష్కర' తీర్థము నేఁడు 'పొఖార' అను పేరితో రాజపుత్రస్థానమునందు 'అజ్మీరు' నకు సమీపమునఁ గలదని, 'రాప్సన్' దొరగారు పశ్చిమభారతదేశము నేలిన 'సహపాన' క్షా

---

3 సూ॥ నడాదిభ్యః ఫక్. నడ... శకట... జాలంధర... యుగంధర... బదర... వేడాది॥ 4-1-99.

1. సాల్వదేశ మెచ్చటిదనియు, దాని కిపు డేపేరుండె ననియు, వాకలుచేసి బంపఁగోరుచు 'లీడర్' పత్రికాధిపులగు సి. వై. చింతామణిగారికిని (అలహాబాదు) కాశిలోని భారతేతిహాస పరిషత్తున కధ్యక్షులగు, డాక్టరు బాబూ రాజేంద్రప్రసాదుగారికిని (పాట్నా) వ్రాసితిని. చింతామణిగారు తమ కస్వస్థతగానున్నది. కాన దీనికై గలుగఁజేసికొనవలె నని వ్రాసిరి. (26-9-40) డాక్టరు బాబూ రాజేంద్రప్రసాదుగారి

త్రవుని యల్లుఁడగు 'ఋషభదత్తుని' శాసనాదులను శోధించి వ్రాసి యున్నారు. ఈ 'పోఖార' తీర్థము ఋషభదత్తునినాఁడు (క్రీ. త. రెండవ శతాబ్దాదిని) 'పోక్షర' తీర్థ మని పేరుగలదనియు 'పోక్షర' పుష్కరశబ్ద ప్రాకృతీకరణమనియు దొరగారి తలంపు. 'పోఖార' విశ్వామిత్రుని కాలమునుండి నేఁటివఱకు పుణ్యయాత్రాస్థానమే.

'పోక్షర' తీర్థము ఆపస్తంబుని సాల్వదేశమునకుఁ బశ్చిమముగా నిరువదియోజనముల దూరమునం దుండవచ్చును.

'సాల్వ' దేశము యమునానదీపరిసరదేశము, అది భారతములోని 'అంబోపాఖ్యానము' వల్ల కాశీ, హస్తినాపురము' లకు నడుమనుండినట్లు స్పష్టమేకదా!

హస్తిపురి, పాండవుల యనంతర మేడవతరమున, గంగాప్రవాహముచేఁ గొట్టుకొనిపోఁగా "నిచక్నుఁడు" అను పాండవవంశస్థుఁడు 'కౌశాంబి' యను యమునాతీరపుపట్టణముఁ జేరి పాలించినట్లు విష్ణు భాగవతాదిపురాణములు చెప్పుచున్నవి. హరివంశమునందు జనమేజయునకు నాల్గవ తరమువాఁడగు 'శ్వేతకర్ణుఁ' డనువాఁడు విరక్తితోఁ దానును, భార్యయు హిమాలయ సానువులలోఁ బోవుచుండ నాతనిభార్య మార్గమధ్యమునందుఁ బ్రసవించి, మగబిడ్డంగని, శిలాభూమి నాబాలుని విడిచి భర్తతోఁబోగా నాబిడ్డఁడు రాలలోఁ గొట్టుకొన, 'పైప్పలాద, బైల్వ, కౌశికు' లను బ్రాహ్మణులాబిడ్డను బోషించి పార్శ్వములు 'మేక'

యంశముఁ గూర్చి 'కాశీ'కి వ్రాసితి మనియు, పరిషత్కార్యదర్శినుండి మీకు జవాబు వచ్చుననియు (13-10-40) వ్రాసిరి. కాని దానికి జవాబు రాలేదు. ది 20-6-41 తేదిని బాబు రాజేంద్రప్రసాదు గారికి మఱియొక యుత్తరముఁ గూడ వ్రాసితిని. పరిశ్రమము దశానంతరము జయచంద్ర విద్యాలంకారులు ('సెక్రటరీ') వ్రాసినదానిని ఇంతకుఁ క్రమె వ్రాసితిని.

వెళ్లకలవర్గమువలె నుండుటచే, వానికి 'అజపార్శ్వ'నామమునుంచి కౌశాంబిపట్టణములో రాజుంజేసి తాము మంత్రులై పాలించిరని కలదు. కౌశాంబి నేఁడు "కోసం" అనుపేరు కల్గి ప్రయాగకు 40 మైళ్లదూరమునఁ గలదు.

వత్స పేరితో 'కౌశాంబీ' రాజ్యము పాలింపఁబడుటచే నారాజ్యమునకు 'వత్స' రాజ్యమని పేరువచ్చెను. "ఉదయన" మహారాజునకు వత్సరాజనియే కాళిదాసమహాకవి 'మేఘదూత' కావ్యమునఁ జెప్పెను. అజపార్శ్వని మంత్రులగు బ్రాహ్మణులు తపోవృత్తిని మాని రాజ్యపాలకులైరి. అందువలననే, విష్ణుభాగవతాది పురాణములలోఁ బశ్చిమభారతదేశమును వ్రాత్యబ్రాహ్మణులు పాలింతురని చెప్పఁబడియుండెను. యుగంధర, యౌగంధరి, యౌగంధరాయణులు, అజపార్శ్వని మంత్రిసంతతివారేమో? యౌగంధరి 'ఉదయన' మహారాజు తండ్రి యగు 'పరంతపు' నికి లోఁబడిన మాండలికప్రభువైనం గావచ్చును. 1.

ఆపస్తంబశాఖ యనఁబడు తైత్తిరీయశాఖ, అధ్వర్యవ(యజ్ఞములు చేయించుటలో ముఖ్యాంశములు గలది) ప్రాధాన్యముకలదగుటచేతను, దానియతిశయవ్యాసకము యమునానదీ పరిసరములందున్న 'సాల్వ, వత్స' దేశములలో విశేషముగా నుండుటచేతను, 'హింసాత్మక యజ్ఞము'లను మాన్పుటకై బుద్ధుఁడు 'కౌశాంబి'కిఁ జుట్టుప్రక్కలలోఁ (భద్రక, కుక్కుట, ఘోషిత, ఆమ్ర, మొదలగు వనాశ్రమములు) పెక్కునాళ్ళు బోధము లొనర్చుటయును, అశోక చక్రవర్తియు నహింసాత్మకబోధకములగు శిలాశాసనములు 'కౌశాంబీ' నగరముననే స్థాపించుటకును గారణము లయ్యెను. 2

1 హరివంశముననే అజపార్శ్వనిమంత్రుల సంతతి మిక్కిలి వృద్ధినొందెనని కలదు.

2. కౌశాంబిశిలాశాసనములందు వివాహాదిక్రియలలో జరుగు జంతువధ 'గోమధుపర్కము' మొదలగువానిని నిరసించుచు వ్రాయఁబడెను.

బౌద్ధులు వైదికమతాంశములఁ గూడఁ దమ మతములోనికి గొన్నిటిని దీసికొనిరి. అందు 'చైత్య' చిహ్నమొకటి. ఇది వైదికమత చిహ్నమే. అపస్తంబుని శ్రౌతసూత్రములలో 'చైత్య' నిర్మాణపద్ధతులు పెక్కుగలవు. అందుఁ గొన్ని 'శ్యేనా,' ద్యాకారములు గలవి. ఆచైత్యముల కెన్నన్ని ఇటికలు కావలెనో దానిఁగూర్చికూడ నియమములున్నవి. యజ్ఞములలో 'ఇష్టకోపదానము'ను నొక ముఖ్యాంగమె. 'అశ్వలాయనుఁడు' కూడ తన గృహ్యసూత్రములలో 'చైత్య' నిర్మాణాంశములఁ జెప్పియున్నాడు.

అపస్తంబమతోదితమగు 'చైత్య' చిహ్నమే ఆంధ్రసమ్రాట్టులగు గోతమీపుత్రశాతకర్ణి' మొదలగువారి నాణెములపైఁ గాన్పించును. ఇప్పటి చారిత్రికు లాపస్తంబకృతసూత్రములఁ జూడకపోవుటచే నది బౌద్ధుల' చిహ్నమనుచుందురు.

అపస్తంబీయులగు నాంధ్రులు మధ్యభారతమునుండి పరులయొత్తిడిచే స్వస్థలములను విడిచి, ఘూర్జరదేశమునఁ గొంతకాలమాగి, పిమ్మట మహారాష్ట్రాదిదేశములకు వలసవచ్చి తుదకు 'ప్రతిష్ఠాన' (పట్టాన్) పురాధీశులైరి. అదియే మొదటి యాంధ్రసామ్రాజ్యపురాజధాని. గోతమీపుత్రశాతకర్ణి నాఁడే 'తెలుఁగు' కళింగదేశములలోఁ బ్రథమమున నాంధ్రులకుఁ బ్రవేశము కలిగె నని నాదృఢాభిప్రాయము. శ్రీన్యాయమూర్తి సర్ వేపా రామేశం పంతులుగారును, ప్రతిష్ఠానపురము నుండియే యాంధ్రులు తెనుఁగు దేశమునకు వచ్చిరని చెప్పియున్నారు.

మన్మిత్రులును ప్రసిద్ధాంధ్రచరిత్ర పరిశోధకులు నగు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు గూడ నాయభిప్రాయము కలవారే.

ఆంధ్రసమ్రాట్టుల శాసనములలో 'వాసిష్ఠీపుత్ర' పులుమావి (క్రీ॥ శ॥ 150 సం॥ర ప్రాంతము) వఱకు నీ ప్రాగాంధ్ర మనఁబడు దేశమున నాంధ్రసమ్రాట్టుల శాసనములు లేకపోవుటయు, నాసిక కార్లీ మొదలగు స్థలములలోని వారిశాసనము లుండుటయు నిందులకుఁ బ్రబల కారణము లనఁదగు, గోతమీపుత్రశాతకర్ణి విజయుల నీప్రాగ్దేశమాంధ్రమునఁ జేరి యుండునట్లు కాన్పించును. మఱియు పుష్యమిత్రునకు (మగధరాజు) సమకాలికుఁడును, కళింగదేశపు రాజును నగు ఖారవేలుఁడు (క్రీ॥ పూ॥ 2వ శతాబ్ది) 'శాతకర్ణని' జయించుటకై పశ్చిమముగా సైన్యముల నంపినట్లాతని 'హాథిగుంఫా' శాసనములవలనఁ దెలియనగుచున్నది. ప్రాచీనకాలమునుండియు 'కళింగము'నకు దక్షిణపుసరిహద్దు 'గోదావరీ'నది. ఖారవేలుని నాఁటికి 'ధాన్యకటక'మే శాతకర్ణుల రాజధాని యైనచో ఖారవేలుఁడు శాతకర్ణిని జయింపఁ బశ్చిమముగా నెచటికి సైన్యముల నంపవలసి యుండెను ?

ఇంతమాత్రమే కాదు, 'టాలిమి' అను 'ఈజిప్టు' దేశ పండితుఁడు, తన భూగోళశాస్త్రమున 'వాసిష్ఠీపుత్ర పులుమావి' (క్రీ॥ శ॥ రెండవశతాబ్దము) రాజధాని, 'ప్రతిష్ఠానపురము' అని వ్రాయుటకూడ నప్పటి కాంధ్రులకు 'ధాన్యకటకము' రాజధాని కాదని దృఢపఱచుచున్నది.

ఉజ్జయినిని బాలించు 'చష్టన' వంశజుల యొత్తిడిచేతనే 'శాతకర్ణు' లనఁబడు నాంధ్రులు ప్రాగాంధ్రమునకుఁ దమ రాజధానిని మార్చుకొని యుందురు.

'ఆంధ్రులు' ప్రాచీనకాలమున 'ఆయుధజీవిక' గణములుగా [1] న

---

1. పాణినిమహర్షి తనయష్టాధ్యాయియందు తనకాలమున భరతఖండమునందుండిన పెక్కు 'ఆయుధజీవిక'సంఘములఁ జెప్పెను. (ఆయుధములను ధరించి పరుల నోడించిరో, వేటాడిరో జీవించుసంఘము లాయుధజీవికసంఘములు.) (5-3-114, 4-3-9)

నేకప్రదేశములకుఁ బోయి రాజ్యములను స్థాపించిరి. అందొకశాఖ తూర్పుగా మగధదేశమున' కేఁగి యచటను, మఱియొకశాఖ 'ప్రతిష్ఠానము' నకేఁగి యచటను వేర్వేఱురాజ్యములను స్థాపించిరి. తూర్పువా రాంధ్రభృత్యులు. ప్రతిష్ఠానపురాధీశులు "శాతకర్ణులు" లేక, సాతవాహనులు' వారికిని వీరికిని గొన్ని పేరులలో మాత్రమె సామ్యమున్నది. వారిపేరులు వీరిపేరులు పూర్తిగ సరిపోవుచుండుట లేదేమని కొందఱు చారిత్రకులు సందేహించుచున్నారు.

ప్రాచీనగ్రంథములలో 'ఆంధ్ర, ఆంధ్రభృత్య' శబ్దములం జూచినను, బ్రహ్మాండపురాణమునం దాంధ్రులైదు తెగలవారై వేర్వేఱు రాజ్యములనుస్థాపించి రనునంశముం బరిశీలించినను. శాతకర్ణులు, ఆంధ్రభృత్యులు భిన్నసంఘములవారని స్పష్టమగును. శాతకర్ణులు ద్విజులు, ఆంధ్రభృత్యులు ద్విజేతరులు నై యున్నారు.

ఆపస్తంబుని సంబంధులగు నాంధ్రులు సాల్వదేశీయులుగదా! సాల్వదేశము 'అభిజనము' (ప్రాచీననివాసమై) గాఁగలిగి యాయుధములను ధరించి జీవించు సంఘమొకటి కలదని 'పాణిని' మహర్షి 'సింధ్వాది గణము' 1 నందు స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. ఆసంఘమునుండియే 'శాతకర్ణులు' దక్షిణమునకును 'సింధులా' ద్యాంధ్రభృత్యులు 'మగధ' దేశమునకును బోయినట్లు కాన్పించును. బ్రహ్మాండపురాణమునందు 'ఆంధ్రులు' ఐదుసంఘములై రాజ్యము నేలిరని చెప్పుటకూడ నాయభిప్రాయమునకు బలమొసఁగుచున్నది.

1. అష్టాధ్యాయి. (4-3-93)

'శాతకర్ణు'లు బ్రాహ్మణులని డాక్టరు జయస్వాల్ గారి యభిప్రాయము. శాతకర్ణులలోఁ బెక్కండ్రు తమ పేరులను తల్లులపేరులతో 'వైదికమతానుసారము'గాఁ2 (గౌతమీపుత్ర, వాసిష్ఠీపుత్ర, మాఢారీపుత్రము॥) నంచుకొనుటయు, 'వేదశ్రీశాతకర్ణి' యను రాజు 'అగ్నికావాహుతుల' నిచ్చువాఁడని (యజ్ఞ మొనర్చినవాఁడు) శాసనములో నుండుటయు, జయస్వాల్ గారి మతమును బలపఱచుచున్నవి. కాలాంతరమున ఆంధ్రభృత్యులును పద్మనాయకులును 'దామన్యాది' గణములోని 'కాకతీయులును' 3 నేఁటి యాంధ్రదేశమును బ్రవేశించి రాజ్యమును స్థాపించిరి.

మనుస్మృతి ననుసరించి 'అంధ్రులు' లేక 'ఆంధ్రులు' సంకీర్ణజాతివా రని కొందఱు తలఁచుట పెద్దపొరపాటు 'ఆంధ్రులు' సంకీర్ణులని చెప్పువారిని భ్రమింపఁజేయునది మనుస్మృతిలోని 'యీక్రిందిశ్లోకమై యున్నది.

శ్లో॥ కారావరో నిషాదాత్తు చర్మకారః ప్రసూయతే
వైదేహసైరంధ్ర భేదౌ బహిర్గ్రామ ప్రతిశ్రయా.

మనుస్మృతి. 10-36.

తా॥ (వైదేహస్త్రీయందు) నిషాదునివలన 'చర్మకారుఁ' డగు కారావరుఁడు జన్మించును. (వైదేహునివలన వైదేహస్త్రీయందు జన్మించిన) వైదేహుఁడు, సైరంధ్రుఁడు నను జాతిభేదములు గలవారు గ్రామమునకు వెలుపల నుండఁ దగినవారు.

ఈశ్లోకము క్రీ. శ. 1867 సం॥రమున మద్రాసునందు 'భువనగిరి' రంగయ్యశెట్టిగారు, పూడి వేంకటసుబ్బశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁజేసి 'కుల్లూకభట్టీయ' వ్యాఖ్యానముతో ముద్రింపించిన 'మనుస్మృతి' నుండి గ్రహింపఁబడెను.

---

2. చూ. శతపదబ్రాహ్మణ, బృహదారణ్యకోపనిషత్తులలోని 'వంశబ్రాహ్మణములు'
3. పాణినీయయష్టాధ్యాయి (5-3-116)

మఱియు 1891 సంవత్సరములో హిందూథియలాజికల్ హైస్కూలుపండితులగు నే. పార్థసారథిఅయ్యంగారు 'మనుధర్మదర్పణ' టీకతో ముద్రింపించిన మనుస్మృతిపాఠముకూడఁ బైదాని వలెనే యున్నది. భేద మేమియును లేదు. కాని యాంధ్రవిద్వేషులెవరో యీక్రింది తాత్పర్యముగల శ్లోకముగా నాగరలిపిలో బొంబాయిపురిలో ముద్రింపించిన మనుస్మృతిలోఁ గూర్చిరి. చూడుఁడు.

శ్లో॥ కారావరో నిషాదాత్తు, చర్మకారం ప్రసూయతే
వైదేహికాదంధ్ర మేదౌ, బహిర్గ్రామ ప్రతిశ్రయౌ.

మను. 10-36.

'కారావరుఁడు నిషాదునివలన' చర్మకారుని గనును. వైదేహికునివలన గ్రామబహిష్కృతులగు 'ఆంధ్రుని, మేదుని' గనును.

ఈ పాఠము దోషసహితమై యనన్వయయుక్తమై యున్నది. ఈ పాఠవిశేషముచే నాంధ్రుఁడు సంకీర్ణుఁడని వ్రాయుట విచారకరము.

ఆమనుస్మృతిలోని 'మేధుఁడు, ఆంధ్రుఁడు, చుంచుఁడు, మద్గుఁడు' అనువారు ఆరణ్యకపశుహింసయే వృత్తిగాఁ గలవారు (మను 10-48) అని చెప్పఁబడెను. అది హీనవృత్తి యని కొందఱు తలఁచుచున్నారు. ప్రాచీనకాలమునఁ బశుహింసనము నీచవృత్తి కాదు. యజ్ఞములలోఁ బశుహింసను బ్రాహ్మణుఁడే చేయుచుండెను. వానికి 'శమిత' అనిపేరు. శమితకుఁ దోడుపడువాఁడు 'ఉపశమిత' ఇటీవల 'కులాలశమిత' (చంపువాఁడు కుమ్మరి) యయ్యె.

విరాటునికడకు సేవకుఁడుగాఁ బోవుభీముని, 'నీవేమి విరటునికడ నొనర్తు' వని ధర్మరాజు డడుగ భీముఁడు (1) 'నేను పూర్వము ధర్మరాజుని

1శ్లో॥ ఆరాళికో గోవికర్తా సూపకర్తా నియోధకః।
ఆసం యుధిష్ఠిరస్యాహ మితి వక్ష్యామి పృచ్ఛతః॥

విరాటపర్వ

కొలువునందు 'వంటవాఁడనై, గోవులను ఖండించువాఁడనై, సూపకారుఁడనై, మల్లుఁడనై' యుంటి నని యాతఁ డడుగఁ జెప్పెదు' ననెను. నాఁ డావృత్తి తప్పకాకుండుటచేతనె ధర్మజుని సోదరుఁ డట్లనెను.

ప్రాచీనయుగముననే కాదు. 'భట్టమురారికవి' కాలమునను బ్రాహ్మణవిద్యార్థులు గురువుల యజ్ఞములందు 'పశువిశసనము' జేయుచున్నట్లే చెప్పియున్నాఁడు. చూడుఁడు.

1. 'గడ్డిమోఁపుల దెబ్బి మేఁపుటచే నైనకష్టమువల్ల బహుకాలమునుండి ద్వేషించుచుండిన బ్రహ్మచారులు నవ్వుచు రెండేండ్లయీడుగల యావుదూడను జంపుచున్నారు.'

పై కారణములవలన మనువుచెప్పిన పశుహింసకవృత్తిచే నాంధ్రులు నీచులు గారు. సంకీర్ణుఁ డాంధ్రుఁడని చెప్పినశ్లోకభాగ మెవరో కల్పించినది. ధర్మశాస్త్రచరిత్ర వ్రాసిన డాక్టర్ పి. జే. కాణేపండితుఁడు (బొంబాయి) మనుస్మృతిలో ననేకప్రక్షిప్తములు ప్రవేశించినవని చెప్పిన యంశము దీనికి నిదర్శనము.

ఇంకను నెన్నియో యాపస్తంబుని ఆంధ్రులను గూర్చి వ్రాయవలసియున్నది. కాని గ్రంథవిస్తరభీతిచే మానితిని.

నే నింతకుముందు (ఆంగీరస సం॥ర ఆంధ్రపత్రిక ఉగాది సంచిక) 'ఆపస్తంబుని' గూర్చి వ్రాసిన వ్యాసమునకును, దీనికిని, 'కాల' నివాసాదులలోఁ గొంతభేద మున్నది. దానికంటె దీనిలోఁ గొన్నివిశేషము లుండునని చదువరులు తలంతురు గాక.

నే నాపస్తంబుని గుఱించి విమర్శించుటలో వాని ధర్మగృహ్య

---

1. శ్లో॥ తత్తాదృ క్తృణ పూల కోపనమిత క్లేశాచ్చిర ద్వేషిభిః
మేధ్యా వత్స తరీ విహస్య వటుభిస్సోల్లుంఠమాలభ్యతే.
అనర్ఘరాఘవనాటక. (2 అంక)

సూత్రములు, మంత్రివన్నములు కాక, 'మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగనాధాచార్యుల'వారి 'లఘుశబ్దార్థ సర్వస్వము' సర్. జస్టిస్ శంకరనాయరుగారు 'మోడరన్ రివ్యూ' పత్రికను వ్రాసిన వ్యాసము, 'ఓల్డెన్‌బర్గు, మాక్సుముల్లరు'గార్ల వ్రాతలంగూర్చి తెల్పిన, గురుతుల్యు లగు శ్రీ కుగ్గిరాల సూర్యప్రకాశరావుగారి యుత్తరములు కూడ తోడ్పడినవి.

ఆంధ్రులఁగూర్చి విమర్శించుటలో శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్రము, వీరభద్రరావుగారికిని, శ్రీమామిడిపూడి వేంకటరంగయ్యగారికి నైన పత్రికావాదములు, జస్టిస్ వేపా రామేశం పంతులు, ఆంధ్ర శేషగిరిరావు, గాడె నరసింగరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మగార్లు 'భారతి' పత్రికలో వ్రాసిన వ్యాసములు తోడ్పడినవి. అందు శ్రీసోమశేఖరశర్మగారి వ్యాసములలో నొకటి, ఆంధ్రుల ప్రథమస్థానమగు 'పుష్కరతీర్థము' (పోఖరా) ను దెలిసికొనుట కత్యంత ముపకరించెను. తదితరగ్రంథముల నామము లాయాచోటులను స్మరించితిని. పై గ్రంథకర్తలకు, వ్యాసకర్తలకుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను.

నే నీపీఠికను ముగించుచుండఁగా 'మండపేట' వాస్తవ్యులును, విద్యావయోవృద్ధులు, మిత్రులు నగు బ్రహ్మశ్రీ దేవులపల్లి నరసింహశాస్త్రిగారు "కారావరోనిషాదాత్తు" అను మనుస్మృతిలోని శ్లోకమునందు 'వైదేహాసైరంధ్రి' శబ్దములే గాని 'వైదేహాదంధ్రమేదా' అను పాఠము లేదనియు, కుల్లూకభట్టుకూడ సైరంధ్ర శబ్దమునే చెప్పెననియు, కొన్నిప్రతులలో నీశ్లోకమే లేదనియు వ్రాసిన యుత్తర మందినది. అందులకు వారికిఁ గృతజ్ఞుఁడను.- శ్రీశాస్త్రిగారి యుత్తరము కూడ 'ఆంధ్రుఁడు, సంకీర్ణుఁడు' అను నపవాదమును దొలఁగించుచున్నది.

# నాలవకథ (వరరుచి.)

ఈకథయందు 'పాణినిమహర్షి' ప్రశంస కలదు. వరరుచి చంద్రగుప్తునకుఁ బూర్వమున మగధరాజ్యము నేలిన నందమహారాజునకుఁ గొంతకాలము మంత్రియైనట్లును, వరరుచి, గృహస్థుఁడైన తరువాతను పాణిని బ్రహ్మచారిగా వరరుచి గురువగు వర్షోపాధ్యాయుని కడ విద్యాభ్యాస మొనర్చినట్లును, జెప్పఁబడుటచేఁ బాణిని వరరుచి కంటెఁ జిన్నవాఁడై 'మౌర్యచంద్రగుప్తుని' పాలనాకాలమున నుండెనని తెలియనగుచున్నది. అందుచేత, పాణినిమహర్షి క్రీ॥ పూ॥ నాలుగు మూఁడు శతాబ్దముల నడుమవాఁ డగుచున్నాఁడు.

కొంద ఱేవేవో యుక్తులఁ జెప్పి, పాణినిమహర్షిని క్రీ॥ పూ॥ 5, 8, 12 శతాబ్దములలోనికి, నెట్టుచున్నారు. కాని, క్షేమేంద్ర మహాకవి (క్రీ॥ శ॥ 11 శతాబ్ది) తన బృహత్కథామంజరిలోను, సోమదేవభట్టారకుఁడు (క్రీ॥ శ॥ 12 శతాబ్ది) తన 'కథాసరిత్సాగరమునను' వరరుచి గృహస్థుఁడైనపిమ్మటనే పాణిని విద్యార్థిగా నుండినట్లు వర్ణించుటచే క్రీ॥ పూ॥ నాల్గవశతాబ్దమునఁ బాణినియుండుననుట నిజమగును. ఇంతమాత్రమె కాదు. పాణినియే తన యష్టాధ్యాయియందు 'బిడాది' గణములో ఆపస్తంబ మహర్షిని (4–3–104), 'నడాది' గణములో (4–1–99) యాగంధరాయణుని స్మరించుటచే క్రీ॥ పూ॥ 8, 12 శతాబ్దములవాఁ డెంతమాత్రము కాఁడు. మఱియు గర్గాదిగణమున (4–1–105) చణకశబ్దమునకు 'యఞ్' వచ్చిన 'చాణక్య'శబ్దమగునని చెప్పుటచే చణకసూనిని, పాణినసూనుఁ డెఱిఁగియుండు ననుట స్పష్టమై, పాణిని మహర్షి క్రీ. పూ. 4, 8 శతాబ్దముల మధ్యకాలమున నుండుట నీకథ విశదపఱచును.

## ఐదవకథ (కుమారిల భట్టాచార్యుఁడు)

కుమారిలభట్టునితో వాదించిన జైనపండితుల పేరులు తెలియక పోవుట విచారకరము. జైనమతము ఛాందోగ్యోపనిషత్తు ఆవిర్భవించినపు డే పుట్టెనని యాయుపనిషత్తునందలి ప్రజాపతీంద్ర విరోచన గాథచేఁ దెలియనగును. 1 జైనమతమునందలి యిరువదినాల్గవ తీర్థంకరుఁడగు మహావీరుఁడు బుద్ధునకు సమకాలికుఁడఁట ! అట్లయిన మొదటి తీర్థంకరుఁడగు ఋషభుఁడు క్రీ. పూ. 10, 12 శతాబ్దములనాఁటివాఁ డైన నగును. జైనమతమవైదికమతము; 'కుమారిలు'నిది వైదికమతము. వైదికమతమునకు నిదాన మగు పూర్వమీమాంసాశాస్త్రమున నిరీశ్వరత్వమె ద్యోతకమగును. తన్మతప్రోక్తము లగు యజ్ఞములలోఁ జేర్పఁబడు 'ఇంద్రాగ్న్యాదులు' శబ్దవాచ్యులే గాని, యుపాస్యులుగారు. అందుచే తనే శ్రీశంకరుఁడు కుమారిలు నెదిరింప సిద్ధపడెను.

ఇట్టి కుమారిలుని వైదికమతమునందు 'కర్మమేగాని, భక్త్యాదులు నున్న. ఆపస్తంబుని వైదికమతమునందు, కర్మము ప్రధానమైనను, చివరదశలోఁ గొంతసూక్ష్మమగు నద్వైతమత బోధకమగుసూత్రములు నుగలవు. 2 అవి యుపనిషదర్థక బ్రహ్మపదార్థ బోధకములే. ఇట్టి సేశ్వరత్వము కుమారిలభట్టుని మతమున మృగ్యము. అతని ప్రతికక్షులగు జైనుల గురువులగు తీర్థంకరుల విగ్రహరూపములే, హిందూమతమున విగ్రహారాధనమునకు దారి చూపినవని కొందఱు తలంతురు.

వైదికమతమున దేవుఁడు రూపము లేనివాఁడు. శబ్దవాచ్యుఁడు. కాన, ఉపాస్యుఁ డగుట కష్టమని జైనములోని విగ్రహారాధనమును వై

1. ఛాందోగ్యోపనిషత్. 8-3. దీనిని వేదాంతశాస్త్రజ్ఞులు 'దేహాత్మ వాదము' గాఁ దలఁచియున్నారు.

2. ఆపస్తంబ ధర్మసూత్రము. 1-22, 23.

దికమతస్థులు శివాదిరూపములఁ దమ మతములోనికిఁ దీసికొని యుండురేమో! మనుజవ్యక్తి మృతి నొందినపిమ్మట "సంచయనకర్మము" (పత్తుఁబోఁత) నాఁడు మొదలు పదియవనాఁటివఱకు శిలారూపియై సనాతన హిందువులచే నారాధింపఁబడి పిమ్మట (శిల) నీరిలో విడువఁబడును. [1] అంతేకాని, విగ్రహత్వము నొందఁడు. అందుచేతనే, వేదర్షులగు నాపస్తంబాది మహర్షులకు, కాళిదాసాది మహాకవులకు, కుమారిలభట్టాది మహాశాస్త్రవేత్తలకు, విగ్రహరూపములు లేవు. పూజ్యులను శిలారూపులనుగాఁ జేయుట నార్యమతస్థులు తప్పుగానే తలఁచిరి. లేకుండిన నాఁటిభారతీయప్రభువులు, 'ఆపస్తంబ, కుమారిలభట్ట, కాళిదాసా' దుల శిలావిగ్రహముల నేల చేయింపరు? సనాతన ధర్మిష్ఠుల మనుకొను కవిపండితప్రకాండులు బ్రతికియుండఁగనే తాము శిలారూపముల నొంద నిచ్ఛగించుట, యజ్ఞానవిలసితము కాదా? కుమారిలాదులగ్రంథములే వారి దివ్యరూపములు. విశిష్టాద్వైతమతమున భక్తులు శిలావిగ్రహరూపులై గౌరవార్హులగుచున్నారు. పంచమహాయజ్ఞములు షట్కర్మలు చేయు వైదికికి విగ్రహారాధన మొనర్పఁ గాల మెపుడు?

సంస్కృతవాఙ్మయమున 'పతంజలి, కుమారిలభట్ట, శంకరాచార్య, సాయణాచార్యుల' భాష్యము లప్రతిమానములు. వాని కవియే సాటి.

## ఆజీవకథ (తెలుఁగునాటి తురుష్కయోగి.)

ఈకథ యన్నిమతములలోను, సద్బోధకులు, నిస్పృహులు, సర్వసములు, నగు మహాభక్తు లుండిరనియు, హైందవేతరప్రభువు లైనను స్వదేశభాషలను బోషించి వృద్ధి నొందింపఁగలరనియుఁ జెప్పను.

---

1. భారద్వాజసూత్రములు. ఆపస్తంబయల్లాజీయము.

## ఏడవకథ (ఆంధ్రగాయకుఁడు.)

భారతీయులు ప్రాచీనకాలమునుండియు, గానకళాకోవిదులని, యజ్ఞములందలి వారి 'ఔద్గాత్రమె' (సామగానభాగము) వెల్లడిచేయును. ఉద్గీథము (సామగానము) మోక్షహేతువని ఛాందోగ్యోపనిషత్తులోఁ గలదు. లౌకికగానమునందు వైదికకాల భారతీయుల జంత్రగాత్రముల విలసనము గానవచ్చును. వేదమునందు *భారతీయగాయకుల భేదములును, తద్వృత్తికరుల భేదములును జెప్పఁబడెను. అందుఁ గొన్ని పేరుల నిట వ్రాయుచున్నాను.

(1) సూతుఁడు=సంగీతము పాడి జీవించువాఁడు. (2) వీణావాదుఁడు=వైణికుఁడు. (3) కోశకారిణి=పాడునపుడు తిత్తి నూఁదునాఁడుది. (4) కింపురుషుఁడు=ఆటవికులకు సంగీతమును వినిపించువాఁడు. (5) తూణవధ్ముఁడు=మురళితోఁ బాడువాఁడు. (6) చర్మమ్నుఁడు=వీణావాదకుల వ్రేళ్ళకుఁ గవచములఁ జేయువాఁడు. (7) గణకుఁడు=శ్రుతి జాతి స్వరాదిగణనముఁ జేయువాఁడు. (8) తూణావధ్ముఁడు=గాత్రముతోను, కట్టెతోనుగూడఁ బాడువాఁడు. (9) పాణిసంభాయి=చేతితోఁ దాళము వేయువాఁడు. (10) అనుక్రోశుఁడు=సంగీతాంతముఁ జెప్పువాఁడు.

అష్టాదశవిద్యలలో గాంధర్వవిద్య వేదముగానే పరిగణింపఁబడెను. అది సామవేదమునకు 'ఉపాంగము' అని 'చరణవ్యూహ' మను గ్రంథము చెప్పుచున్నది.

ఆంధ్రగాయకుఁడైన 'త్యాగరాజయోగి' యొక్క గీతములు దక్షిణభారతదేశమున, నేఁటిభారతీయగాయకులకు గురుత్వమును, శ్రోతల

---

* తైత్తిరీయబ్రాహ్మణము. 3-4

కానందపరవశత్వమును, గలిగించునని యీ కథవలనఁ దెలియఁదగిన విషయము.

## ఎనిమిదవకథ (ప్రాచీనాంధ్రవర్తకుఁడు)

ఆంధ్రులు పరదేశముల కేఁగుటకు భయపడువా రనునొక యపవాదము నీకథ పోఁగొట్టుచున్నది. పరదేశమున వర్తకమొనర్పఁ బ్రోత్సహించి, వసుమంతుని 'ఫ్రాంసు' దేశమున కంపిన 'శ్రీవీరవేంకటపతిరాయలు', నాతని మంత్రియగు 'దత్తనామాత్యుఁడు' కొంతకాలము జీవించి యుండు రేని—మహంమదీయుల యొత్తిడి 'చంద్రగిరి' ప్రభువులకు లేకుండెనేని దక్షిణహిందూదేశచరిత్ర వేఱుగ నుండునని తలఁపనగుచున్నది. ఈకథ జరుగునాఁటి 'యూరేషియా' భూగోళపరిస్థితులును, నీకథ వలన విశదమగును.

'శుకసప్తతి'లోని ప్రథమకథను, చంద్రభానుచరిత్రాది గ్రంథములను జదివి యీకథ నాచేఁ గూర్పఁబడెను.

## తొమ్మిదవకథ (శ్రీశైలమల్లికార్జునుఁడు.)

ఈకథకు నాదిగ్రంథమగు శ్రీశైలఖండములోని 'శైవమతము'నకును, 'బసవపురాణము,' పండితారాధ్యచరిత్రము,' ఆంధ్ర శ్రీపర్వతపురాణము,' పుట్టునాఁటి 'వీరశైవమతము' నకును జాల భేదములున్నవి.

'మల్లికార్జున దేవుఁడు' వీరశైవ మతస్థులకుఁ బ్రధానదైవతము. ఆదేవుని యుత్పత్తి యిందుఁ గలదు. వీరశైవము జైనమతము నణఁచుటకే 'బసవేశ్వరుని' వల్ల నావిర్భవింపఁబడినట్లు బసవపురాణముఁ జదివినవారికి స్పష్టమగును. ప్రాచీనశైవమతాంశము లీ కథవల్లఁ దెలియనగును.

పిఠాపురమున నొక బౌద్ధస్తూపముండిన చిహ్నములు పొడకట్టుచున్నవి. దానిం దర్శివ్వి యందలి శాసనాదులను శోధించినయెడల మఱి కొన్ని యాంధ్రుల ప్రాచీనచారిత్రకవిశేషములు పరిశోధకులకు లభింపఁ గలవు. ప్రాచీనాంధ్రవిజ్ఞానాంశములఁ గొన్నిటిమాత్ర మీగ్రంథమున వ్రాసినందున ధన్యుఁడనుగాఁ దలఁచుచున్నాను.

## —• స్వ వి ష య ము. •—

ఈగ్రంథమును వ్రాయుటకు "నరసన్నపేట" నివాసులు, పండితపోషకులు, పెక్కు ధర్మకార్యము లొనర్చినవారు నగు, శ్రీపాటూర్నరు స్వామిబాబుగారు హేతుభూతులు; వారిసహాయమే లేకుండిన నేనీపుస్తకమును ముద్రింపలేకుందును. కాన మిత్రులగు వారికే యీగ్రంథమును గృతజ్ఞతాపూర్వకముగాఁ గృతి నిచ్చుచున్నాను.

ఇట్లు,

ఓలేటి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

# నవకథామంజరి

## * ఆంధ్రులదాయాదుఁడు



ఇక్ష్వాకువంశమున 'వేధసుఁ' డనురాజు కలఁడు. పౌరాణికు లాతనిని త్రిశంకుఁ డందురు. ఆతనికి హరిశ్చంద్రుఁడను పుత్రుఁడు పుట్టెను. ఆహరిశ్చంద్రునకు నూర్వురు భార్య లుండినను బహుకాలమువఱకు పుత్రసంతతి లేనందున నారాజు చింతించుచుండెను.

ఇట్లుండ నాహరిశ్చంద్రుని గృహమున కొకప్పుడు 'పర్వతుఁడు, నారదుఁడు' నను నిద్దఱుమహర్షు లతిథులై రాఁగా, హరిశ్చంద్రుఁ డామునుల నాతిథ్యమిచ్చి గౌరవించి, నారదమునితోఁ బుత్రోత్పత్తి ప్రశంసం జేయ నాముని పుత్రోత్పత్తి వలనఁ గల్గు లాభములను జెప్పెను. హరిశ్చంద్రుఁడు తనకెట్లు పుత్రోత్పత్తి యగునో చెప్పుమనెను అందులకు నారదుఁడు, ఓ రాజా! నీవు 'వరుణ' దేవుని, నాకుఁ బుత్రునొసఁగిన నే నాపుత్రుని బశువుగాఁ జేసి నిన్నుఁగూర్చి యజ్ఞముఁ జేయుదునని ప్రార్థింపుము. అట్లు చేసితివేని నీకు వరుణుఁడు పుత్రునొసంగు ననియెను.

పిమ్మట హరిశ్చంద్రుఁడు వరుణుఁ గూర్చి నాకొక పుత్రునొసంగిన నే నాపుత్రుని బశువుగాఁ జేసి, యజ్ఞముఁ జేయుదునని ప్రార్థింప వరుణుఁడు ప్రత్యక్షమై పుత్రుఁడు కలుగ వరమిచ్చెను.

పిమ్మట హరిశ్చంద్రునకు 'రోహితుఁ' డను పుత్రుఁ డుద్భవింప వరుణుఁడు వచ్చి, యీబాలునిచే నాకు యజ్ఞముఁ జేయుమన హరిశ్చంద్రుఁడు, పుత్రప్రేమచే బిడ్డను వదలలేక "జాతాశౌచదినములు వెళ్లిన గాని బాలపశువునకు యజ్ఞార్హతలే" దనఁగా, వరుణుఁడు వల్లెయని వెడలిపోయెను.

* ఈకథ ఐతరేయబ్రాహ్మణమునుండి యాంధ్రీకరింపఁబడెను.

జాతాశౌచదినములు వెళ్లినపిమ్మట వరుణుఁడేతెంచి నీవు చెప్పిన గడువు ముగిసినది గాన వీనిచే నాకై యజ్ఞము నొనర్పుమనఁగా హరిశ్చంద్రుఁడు 'పశువునకు దంతములు వచ్చినఁగాని యది మేధ్యము కా' దనఁగా వరుణుఁ డంగీకరించి వెళ్లిపోయెను.

పిమ్మట రోహితునకు దంతములురాఁగా వరుణుఁడు ప్రత్యక్షమై బాలునకు దంతములు వచ్చినవి గాన వీనిని యాగపశువుం జేసి యజనము నొనర్పుమనెను. "ఈబాలున కిపుడు వచ్చిన దంతములు స్థిరములైనవికావు. కాన నివి యూడినఁగాని యాగార్హుఁడై యీబిడ్డఁ డుండఁ" డని హరిశ్చంద్రుఁ డన 'తథాస్తు' అని వరుణుఁడు తిరోహితుఁడయ్యెను.

తరువాత పాలపండ్లూడఁగా వరుణుఁ డెప్పటియట్ల వచ్చి పల్లూడినవి గాన, వీనిచే జన్నము నొనర్పుమనఁగా "రెండవసారి దంతములు రానిదే పశువు సర్వావయవసంపూర్ణత నొంద" దని హరిశ్చంద్రుఁ డన వరుణుఁ డంగీకరించెను. రెండవసార దంతములు రాఁగా, వరుణుఁ డెప్పటివలె వచ్చి, యవయవసంపూర్ణత కలిగెనుగాన నీకుమారునిచే, ఇష్టిని జేయమనెను. "పశువు కాఁగల క్షత్రియుఁడు స్వకులోచిత మగు సన్నాహశీలి కాకుండిన, యజ్ఞమునందు విశసింప నర్హుఁడు కాఁడు" అని హరిశ్చంద్రుఁ డనఁ బూర్వమువలెనె వరుణుఁ డంగీకరించి యంతర్ధానుఁ డయ్యెను.

పిమ్మట 'రోహితుఁడు' యుద్ధశాస్త్రమును నేర్చి కవచధనుర్బాణాదులను ధరించుచుండ వరుణుఁడేతెంచి, సన్నాహశీలిగాన నీకుమారునిచే సవనఁ బొనర్పుమనెను. దానికి హరిశ్చంద్రుఁ డట్లేచేయుదునని యంగీకరించి రోహితుని బిలిచి యిట్లు చెప్పెను. "నాయనా! నాకొలకు నిన్నీవరుణుఁ డిచ్చెను. అయ్యో! నిన్ను బశువుగాఁ జేసి నేనీ వరుణుని గూర్చి యజ్ఞముం జేయుచున్నా" నన, నారోహితుఁ డంగీకరింపక, ధనుర్ధరుఁడై యరణ్యమునకుఁ బరుగిడి యట నుండెను.

హరిశ్చంద్రుఁ డనినరీతిని యజ్ఞమును జేయనందున వరుణుఁడు హరిశ్చంద్రుని బట్టుకొనఁగా, హరిశ్చంద్రునకు 'జలోదర' రోగముకలిగి బాధపడుచుండెను.

## —• రోహితుని ప్రవర్తనము •—

తండ్రికి జలోదరరోగము కలిగెనని యరణ్యమం దొక సంవత్సరము నివసించిన తరువాత 'రోహితునకుఁ' దెలిసి యాతఁడు తిరిగి పురమునకు వచ్చుచుండగా 'ఇంద్రుఁడు' బ్రాహ్మణవేషధారియై మార్గమధ్యమున నొక సాకుచెప్పి రోహితుని మరల వనమునఁ దిరుగునట్లు చేసెను. ఇట్లొకపర్యాయముకాదు—అయిదు పర్యాయములింద్రుఁ డిట్టివియో సాకులుచెప్పి రోహితుని వెనుక కరణ్యమునకుఁ బంపుచుండుటచే రోహితుఁ డరణ్యమున నాఱేం డ్లుండవలసివచ్చెను.

ఎట్లయినను హరిశ్చంద్రుఁడు మనుష్యపశువుచే యజ్ఞముఁ జేయనియెడల నాతనికి రోగనివృత్తి కాదని, రోహితుఁడు తలఁచి తనకు మారుగా నొకనిని, హరిశ్చంద్రుని యాగముకై యరణ్యమున వెదుకుచుండగా, నాయడవియం దొక పర్వతపుచరియలో దరిద్రముచే భుక్తికిలేక బాధనొందుచున్న 'సూయవసుని' పుత్రుఁడగు 'అజీగర్తుఁడు' అనునొక బ్రాహ్మణుని జూచెను. అయ్యజీగర్తునకుఁ 'శునఃపుచ్ఛుఁడు, శునశ్శేపుఁడు, శునఃలాంగూలుఁడు' నను ముప్వురు కుమారులుకలరు. అట్టి యాబీదబాపని జూచి, రోహితుఁడు "ఓఋషీ! నీకుమారులలో నొకనిని నాకిమ్ము, నీకు నూఱుగోవుల నిచ్చెదను. నాకుఁ బ్రతినిధిగా వానిని జేకొని యజ్ఞము చేయింతు" ననెను. దానికి నజీగర్తుఁ డంగీకరించెను. కాని, పెద్దవాఁడు నాకెంతయుఁ బ్రియతనూజుఁడు గాన నతని నీకు నీఁజాల ననియెను; పిన్నవాఁడు నాకెంతయుఁ బ్రియుఁడు గాన నాకువానిని నీఁ జాల నని తల్లిచెప్పెను. తల్లిదండ్రుల మాటలను విని మధ్యముఁడగు శునశ్శేపుఁ డిట్లనియెను.

‘ఓరాజా! పెద్దవాఁడు తండ్రికిఁ జాలఁ బ్రియసుతుం డయ్యె; చిన్నవాఁడు తల్లికి ముద్దు బిడ్డఁడయ్యె. వారలిరువురు నొల్లని వాఁడనైన మధ్యముఁడను గాన నూఱుగోవులను వీనికిమ్ము, నీవెనుకనే వచ్చెద’ ననిన రోహితుఁడు నూఱుగోవుల నజీగర్తున కిచ్చి శునశ్శేపుని వెంటనిడుకొని, పురప్రవేశంబు చేసి హరిశ్చంద్రునితో, ‘తండ్రీ! నాకు మాఱుగ వీనిని యజ్ఞపశువుగాఁ దెచ్చితి ననెను.

అందులకు హరిశ్చంద్రుఁడు సంతసించి, వరుణునితో నీ ‘శునశ్శేపుని, బశువుగాఁ జేసి నీకు యజ్ఞము నొనరుతునన, వరుణుఁడు, క్షత్రియునికంటె బ్రాహ్మణుఁడె శ్రేష్ఠుఁడుగదా! వీనిం బశువుగాఁజేసి ‘రాజసూయ’ యాగముం జేయుమని చెప్పఁగా, హరిశ్చంద్రుఁడు రాజసూయములోని సోమయాగాంగమగు నొకకర్మమునందు శునశ్శేపునిఁ బశువుగా నేర్పఱచెను. ఆయజ్ఞమున హరిశ్చంద్రునకు విశ్వామిత్రుఁడు హోత, జమదగ్ని అధ్వర్యుఁడు, వసిష్ఠుడు, బ్రహ్మ, అయాస్యుఁడు “ఉద్గాత” అను ఋత్విక్కులైరి.

పైనల్వురు మహర్షులు రాజసూయముఁ జేయింపు చుండఁగా ‘మనుష్యపశువును’ బంధింపుసమయ మాసన్నమైనది. విశసింపఁబడు పశువునకుఁ గొన్ని సంస్కారణములఁ జేసిన పిదప రెండుపేటలు వేయఁబడి రెండుబారల పొడవుగల రెండు కుశనిర్మితములగు త్రాళ్లతో కాళ్లను తలను గట్టిగా బంధించి, మూఁడుపేటలు గలిగి మూఁడుబారలు పొడవుగల త్రాఁటిచే మధ్యభాగమును యూపస్తంభమున కంటఁగట్టవలయు నను విధికలదు. ఇపుడు విశసింపఁబడు పశువో! సాధారణపశువా? కాదు! యువకుఁడు—మహర్షిగోత్రోత్పన్నుఁడు—మహాకవి—వేదవేది— బ్రహ్మవర్చస్వి—మహాభక్తుఁడు; అట్టివానిని, బైవిధమున బంధింప నెవనికి చేతులువచ్చును? ఎవఁడును బంధింప నంగీకరింపలేదు గాని, నూఱుగో

వులకుఁ బుత్రినమ్మిన శునశ్శేపుని తండ్రియగు 'అజీగర్తుఁడే' నాకింకను నూఱుగోవుల నిచ్చినయెడల నేను శునశ్శేపుని బంధింతునని పలుక, హరిశ్చంద్రుఁ డట్లె నూఱుగోవుల నీయఁగా నజీగర్తుఁడు దారుహృదయముతో—కాదు, శిలాహృదయముతోఁ బుత్రుని విశసింపఁ యూపస్తంభమునకుఁ బైరితి నంటఁగట్టెను.

అపుడధ్వర్యుఁ డేతెంచి, బంధితుఁడగు శునశ్శేపునకు విశసించుటకుఁ బూర్వము చేయఁదగిన కొన్నికర్మములఁ జేసెను. పిమ్మటఁ బశువును ఖడ్గముతో విశసించుసమయమేతేర బ్రహ్మతేజస్వియగు శునశ్శేపుని బంధించుటకే యెవఁడును సిద్ధపడకుండినపుడు ఖడ్గముతో ఖండింపనెవఁ డాయత్తపడును ? ఆమహాక్రూరుఁడగు నజీగర్తుఁడే తన కుమారుని మఱినూఱుగోవుల నిచ్చినయెడల నేను ఖండింతునని వజ్రయహృదయముతోఁ బల్కెను. నూఱుగోవులను హరిశ్చంద్రుఁ డీయ నజీగర్తుఁడు కుమారుని విశసింప ఖడ్గము వహించెను.

హా ! ఎంతక్రూరకర్మము ! తనగర్భమున జన్మించి సుగుణవంతుఁడై, విద్యాయుక్తుఁడై సురూపుఁడై పితృభక్తి దైవభక్తులుగలిగి సుకుమారుఁడైన పుత్రుం జంప నెవనికి మనసొప్పును ? అజీగర్తుఁడుమాత్రమె ఖండింపఁ దలంచెను. ఇది దరిద్రదోషము. ఆకలిచేఁ గడుపుమాడి యుదరపోషణముకై చేయఁదలఁచిన మహాపాతకము ! మతద్వేషముచేఁ గుమారుని ఖండింప నెంచిన హిరణ్యాకశిపుని చర్యయు నిట్టిదేకదా ?

శునశ్శేపుఁడు, తొలుఁత దన్ను బంధించి; యశ్వమేధములో సింహాదిజంతువుల కొనర్చినట్లు కొన్ని సంస్కారములం జేసి, మనుష్యుని గూడ నరణ్యమున విడువఁగలరనియుఁ, దానచటనైన విడువఁబడిన నెటులనో జీవింపవచ్చుననియుఁ దలఁచెను. కాని, రాజసూయమునఁ దప్పక నరుఁడు విశసింపఁ బడవలయునను విధి కలదని యాతనికిఁ దెలియదు. కాని తండ్రి ఖడ్గముఁ జేఁబూనగానె యిట్లనుకొనెను.

"హా! నన్ను విడువక సాధారణపు యాగపశువువలెనే విశసింతురా? అయ్యో! నే నిప్పు డేవేల్పుఁ జింతింతును? శుభకరుఁడగు నేదేవుని బ్రార్థింతును? తిరిగి నన్నే దేవత భూమిపై నుండనిచ్చును? నిజముగ నేను మాతల్లిని జూచుస్థితి కలుగునా? ఓవరుణా! నామొఱ్ఱ నాలకింపుము. రక్షణేచ్ఛచే నీకెదురుగఁ జేయు నాస్తోత్రముల నాలకించి నన్ను సుఖవంతునిగాఁ జేయుము. (1) బహుజనులచే స్తుతింపఁబడు నోవరుణదేవా! సమీపమునందే మరణముగల నేను వేదవాక్కుచే నిన్ను నుతింపుచు నాకాయువు నిమ్మని కోరుచున్నాను. యజమానుఁడుగూడ (హరిశ్చంద్రుఁడు) హవిస్సులచే నిన్నాయాయువునే కోరుచున్నాఁడు. నీవు మాయిరువురకోర్కుల ననాదరముతోఁ జూడక, హేళనము చేయక మాయిరువురయొక్క యాయురారోగ్యములను వృద్ధిఁ జేయుము."

శునశ్శేపుఁ డిట్లు పెక్కువిధముల వరుణాదిదేవతలను స్తోత్రము చేసిచేసి "గొప్పవారలకు నమస్కారము, పిల్లలకు వందనము, యువకుల కభివాదనము, వృద్ధులకు జోహారు. ఓదేవతలారా! నాకు శక్తి గలిగి జీవించినయెడల మిమ్ముల నర్చింతును! ఓ పరమేశ్వరా! నిన్ను స్తోత్రముచేయుటలో లోపమును గల్గింపను. రక్షింపుము; రక్షింపుము; రక్షింపుము. అని స్తోత్రము చేయుచుండగా, పటుక్కుమని యూపాదమస్తకముఁ గట్టిన కట్లొక్కసారి తెగిపోఁగా, శునశ్శేపుఁ డెదురనుండిన విశ్వామిత్రుని యొడిలోఁ బడి రక్షింపుము; రక్షింపు మని వేఁడెను. దయాళుఁడై విశ్వామిత్రుఁడు రక్షింతు ననెను.

శునశ్శేపుఁడు విశ్వామిత్రునంకతలముఁ జేరగనే శునశ్శేపుని తండ్రియగు నజీగర్తుఁడు విశ్వామిత్రుకడ కేఁగి నాపుత్రుని నా కిమ్మన,

(1) ఈయర్థముగల మంత్రమిపుడును బ్రాహ్మణులచే సాయంసంధ్యలో జపింపఁబడుచుండును.

భర్త దాఁచనిచ్చినధనము నొసంగ నని లజ్జ విడిచి పలికెను. పిడుగుచే నడఁపఁబడినదానివలె నుపకోశయు వణఁకుచు నొక్కక్షణ మేమిసేయుటకుఁ దోఁపక "ఏమిగతి? ఈజాల్ముఁడు నాదుర్మార్గులనే యనుకరించుచున్నాఁడు" అని తనహృదయమునం జింతించుచు మున్ను చెప్పిన రాత్రి యందే నాల్గవజామున వానికిని సంకేత మేర్పఱిచెను.

అంత నిర్దేశింపఁబడిన యారాత్రి వచ్చుటయు నేరుపుకత్తెలగు నుపకోశ చేటికలు ముందే యోచించి కస్తూరి మొదలగు పరిమళవస్తువులను, తైలమును గూర్చిన కాటుకను దానిచేఁ బులుమఁబడిన గుడ్డపీలికలను సన్నద్ధము చేసి యింటినడుమఁ బెద్ద మందస మొకటి యుంచి యా దుర్వినీతుల రాక కెదురుసూచుచుండిరి. మొదటిజామునఁ గుమారసచివుఁడు సర్వాలంకారభూషితుండై తన్నెవ్వరుఁ జూడకుండ నాసాధ్వీమణి యింటఁ బ్రవేశించెను. "స్నానము సేయని నిన్ను మాస్వామిని స్పృశింప" దని చేటికలు పలుకుటయు నతఁడు 'నట్లే' యని వారితో లోపలకుఁ జని యంధకారబంధుర మగు నభ్యంతరగృహమున వస్త్రాలంకారములను దీసి యాచేటికలచే నొసఁగఁబడిన కాటుక పూసిన ప్రాఁతపొత్తికను గట్టుకొని వారిచ్చిన కాటుకను నఖశిఖపర్యంత మలందుకొని తన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచుకొనెను. ఇట్లతఁ డంధకారమునం దభ్యంగన సుఖమనుభవించుచు నెడతెగక పొడము మనోరథపరంపరలచే బద్ధుండై మొదటిజాము గడచినను దెలిసికొన లేకపోయెను. రెండవజామున వచ్చిన పురోహితుని జూచి యాచేటికలు సంభ్రమముతో "ఈ పురోహితుఁడు వరరుచి మిత్రము. మొదటఁ దెలియఁజేయకయే వచ్చినవాఁడు. ఏమిసేయుదము? ఇచ్చట నొకనిముసము డాఁగి యుండుము" అని కుమారసచివునితో జెప్పి వాని నచ్చట నున్న మందసములోఁ బెట్టి తాళము వేసిరి. అట్లే పురోధయు నావనిత తైలచేఁ బ్రలోభితుఁడై స్నా

సమీపమున లోనికిఁ గొంపోఁబడి, కొటుకచేఁ దల యంటుకొనుచు, దండనాయకుఁడు వచ్చినపుడు మొదటివానివలెఁ బెట్టెలో బంధింపఁబడెను. దండనాయకుఁడును గాటుక పూఁతలచేతనే సంతసించుచుఁ గోమటి వచ్చినతోడనే మంజూషలోఁ బ్రవేశించెను. ఈదురాత్ములు ముప్వురును మీఁదఁ దమకు లభింపఁ బోవు సంధతామిసశ్రివాసము నభ్యసించువారివలె నాపేటికయం దన్యోన్యము స్పృశించుచున్నవా రయ్యు సిగ్గుచేతను భయముచేతను బరస్పరము సంభాషింపరైరి. తన శరీరమును, భాగధేయమును నిందించుకొనుచు మొగము వంచుకొని యున్న పతివ్రతాశిరోమణి యగు నుపకోశయుఁ బనికత్తెయలచేఁ జేరితయై యెట్లో ధైర్యముఁ జిక్కఁబట్టి యెదుట నున్న కోమటిని "నాభర్త దాఁచనిచ్చిన ధనము నీ" మ్మని యడిగెను. "అట్లె యిచ్చెద"' నని యాజాల్ముఁడు పలుకుచుండ నాపె మంజూషను దట్టి "ఓగృహదేవతలారా! యీ హిరణ్యగుప్తుని వచనముల నాలకింపుఁడు" అని పలికెను.

అంత నభ్యంగన మొనరించుచున్న వైశ్యుఁడు "రాత్రి ప్రభాతప్రాయ మయ్యెను. ధూర్తాగ్రేసరా! నీయింటికిఁ బొమ్ము" అని పనికత్తెలచే బలాత్కారముగా మెడఁబట్టి గెంటఁబడి, యొడలునిండ మసితోడను, జిరిగినకట్టఁబట్టలతోను సిగ్గుపడుచు నింటికిఁ బోయి మసఁగడుగవచ్చిన దాసజనుల యెదుటఁగూడఁ దల యెత్తుకొనలేకపోయెను.

పిమ్మట సాధ్వీమణి యగు నుపకోశ నందభూపాలునిభవనమున కేఁగి "దేవా! హిరణ్యగుప్తుఁడు నాభర్త దాఁచ నిచ్చిన ధనము నపహరింపఁదలఁచియున్నాఁ"' డని విన్నవించెను. రాజు వానిని వెంటనే రప్పించి యడుగ "నీపె భర్త ధనము నాయొద్ద నించుకంతయు లే"' దని శపథపూర్వకముగా నాబచ్చు నుడివెను. అప్పు డామె "మహారాజా! నాభర్తచేఁ బెట్టెలోఁ బెట్టి యుంచఁబడిన గృహదేవతలే యీవిషయమునందు

సాక్షీణులు. వారల యెదుట నీతఁడు తనయొద్ద నున్న ధనమునుగురిం
చి ప్రస్తావించి యున్నాఁడు. కావున నిది చక్కఁగా విచారింపవలయు"
నని పలికెను. అది విని రాజు విస్మితుఁడై భటులచే నా మందసమును
సభకుఁ దెప్పింప నాయుపకోశ "దేవతలారా! ఈకోమటి మీయొద్ద 'నే
మనియెనో యది యెల్ల నిచటఁ జెప్పి పిదప మీరు మీగృహంబుల
కేగుఁడు" అని బిగ్గరగాఁ బలికెను. రాజసభలోఁ దమ రహస్యము బ
యలుపడునేమో! యని వడఁకుచు వారు "నిజముగ నీతఁడు తనయొ
ద్ద నీపెధనమున్న దని యంగీకరించె" నని చెప్పిరి. అంత నా కోమటి
యు నిరుత్తరుఁడై యాద్రవ్య మంతయుఁ దనయొద్ద నున్న ట్లొప్పు
కొనియెను.

పిమ్మట నా పతివ్రతను బ్రార్థించి యా మందసమును దెఱచుట
కనుజ్ఞ వడసి నందమహారాజు భటులచే నా పెట్టె మూఁత నెత్తింపఁగా,
మసిముద్దలవలె నున్న దుర్మార్గులు ముప్పురు బయలుపడిరి. ఎట్టకేలకుఁ
గొందఱు వారిని గుర్తించి చెప్ప సభ్యు లెల్లరు నొక్కపెట్టున నవ్విరి.
రాజు విస్మితుఁడై యిది యేమి? యని యాసాధ్వి నడుగ నామె జరిగిన
వృత్తాంతము నంతయు నాసభ్యు లందఱు వినునట్లు చెప్పెను. వినినవా
రందఱు నామె ననేకవిధముల నభినందించిరి. నృపతియుఁ బరదారాసక్తు
లైన యాదుర్వినీతుల నలువురను దన దేశమునుండి వెడలఁగొట్టించి
యుపకోశను సత్కరించెను. వర్షోపవర్షు లామె వృత్తాంతమును విని యా
నందించిరి. పౌరు లామెను పాతివ్రత్యదేవత యని యర్చించిరి. ఆమె
యు ననుదినము భర్తృస్మరణ పరాయణయై తనయింట నుండెను. కాల
క్రమమున హిమవత్పర్వతమునందుఁ దీవ్రతపముఁ జేయుచున్న వరరుచి
పరమేశ్వరు . ననుగ్రహమునఁ బాణినేయవ్యాకరణము నెల్ల సరహస్యము
గఁ బడసెను. మహాదేవునానతి నతఁడనుక్తమును బూరించియు, దురు

క్తమును సంస్కరించియు నాపాణినిశాస్త్రమునకు మెఱుఁగు వెట్టెను. ఇట్లు గౌరీనాథుని ప్రసాదముపడసి ప్రతిభాశాలియై యుపకోశభర్త తుహారాద్రినుండి కొలఁదినాళ్ళకే యాశ్రమంబునఁ బాటలీపుత్రము చేరెను. తల్లియు గురువులు నాతనిరాక నభినందించిరి. కాత్యాయనుఁడు వారల చరణములకు సాష్టాంగ మెఱఁగి యద్భుతమగు నుపకోశావృత్తాంతమును విని విస్మయావిష్టుండై యట్టిధర్మపత్నిచేఁ దనగృహస్థధర్మము సఫల మయ్యెనని తలంచెను.

అంత వరరుచివలన, నూతనవ్యాకరణము వినఁదలంచిన వర్షునకు భగవానుఁడగు కార్తికేయుఁడే యది యెల్ల నెఱింగించెను. వ్యాడీంద్రదత్తులును వర్షోపాధ్యాయునితోఁ బాణినీయముఁ జదివిరి. పిదప వారిరువురు వర్షునికి గురుదక్షిణ నొసఁగఁదలంచి తమయభీప్సితము నాతనికి నివేదించిరి. అదివిని వర్షుఁడు కోటిసువర్ణములఁ గోరెను. పల్లెయని వారిరువురు నరసికొని, వరరుచిని బిలిచి "మిత్రమా! మనయుపాధ్యాయుఁడు కోటిసువర్ణములు దక్షిణఁ గోరెను. ఇంతబంగారము, నందభూపాలుని కంటె వేఱొకనివలనఁ బడయనరాదు. అతఁడు తొంబదితొమ్మిదికోట్ల సువర్ణములుగల రాజు. మున్నె నీయిల్లాలాతనిచేఁ దోఁబుట్టువుగా నాదరింపఁబడినది. కావున నీగుణములకుఁ దనిసినయతఁడు నీవడిగినదెల్లఁ దప్పక యొసంగును. అతఁ డిప్పు డయోధ్య నున్నవాఁడు. రమ్ము చటికిఁ బోవుదము" అనివాక్రుచ్చిరి. పిమ్మట నాముగ్గురుసతీర్థ్యులు నయోధ్య కరిగిరి. అక్కటకటా! వీరాపురము సొచ్చినతోడనే నందమహారాజు కీర్తిశేషుఁ డయ్యెను. దాన నారాష్ట్రమున గొప్పయలజడి గలిగెను.

అంత నాముగ్గురును జింతాక్రాంత మానసులై చేయునది లేక విచారించుచుండ, యోగసిద్ధుఁడగు నింద్రదత్తుఁడు "మిత్రులారా! నాకొకయుపాయము తోఁచుచున్నది. మృతుండగు నందమహారాజు కళేబ

రమున యోగమహిమచే నేను ప్రవేశించెదను. అపుడు వరరుచి ధనము
దుగుఁగాక! నేను మరల వచ్చునంతవరకు నాశరీరము నీపాడుదేవళమున
నుంచి వ్యాడి రక్షించుచుండవలయు" నని పలికెను. ఇంద్రదత్తుని పలు
కుల కలరి వ్యాడియు వరరుచియు మేలు! మే! లనిరి.

నందమహారాజు ప్రాణముల విడినతోడనే యెల్లచోటుల నొక్క
పెట్టున హాహాకారములు బయలు వెడలెను. శకటాలుఁడు లోనగుమం
త్రు లంతిపురికిఁ జని "అయ్యో! అయ్యో! ఇఁక నేమున్నది? దిక్కుమా
లినవార మైతిమి. నంద! నయనానంద! నిన్ను గోల్పోయిన మామనుగ
డ యేల? ధర్మసేతువు తెగినది. వసుధ యనాథమైనది. విబుధులు నిరా
శ్రయులైరి. సరస్వతి నిరవలంబమైనది. లోకులు నిరుత్సాహులైరి. దుర్మా
ర్గులు నిరంకుశులైరి. సత్కార్యము లదృశ్యము లైనవి. జగమెల్ల జీర్ణార
ణ్యమాయినది" అని యనేకవిధములఁ బలవించుచున్న రాజపత్నుల నూ
రడించిరి. కాని కాంతిహీనమై పుడమిపైఁ బడియున్న మహారాజు శరీర
ముఁ గనుఁగొన వారికిని దుఃఖ మాగినదికాదు. ప్రధానమంత్రియగు
శకటాలుఁడు "మహారాజా! మమ్మునెల్లర నిట్లు వెతలఁ బెట్టి, తపసు ధా
రవోసి కన్న యీపసివానిఁ జంద్రగుప్తుని శత్రువులవాతఁ బడవైచి, నీ
తోడిద లోకమని యున్న యంతఃపురకాంతలనైనఁ దలంపక యీలోక
ము నిట్లువిడిచితి" వని వాపోవుచు సూక్ష్మదృష్టిచే నానృపాలుని బరి
కించి యాతని మొగమునఁ జిఱునగవు పొడసూప నేమిది? యని యదరి
పడి యాతని శిరముఁ దాఁకెను. అప్పుడు నందుఁడు నిదురవోయి మేల్కొ
న్నట్లు కన్నులు తెఱచి "ఎందుల కీకోలాహలము? నేను మృతి నొంద
లేను. నాకేండ్లుఁ బ్రతుకఁగోరెద" నని యల్లనఁ జెప్పెను.

"ప్రజల పుణ్యంబున నందమహారాజు జీవించియే యున్న
వాఁడు. మహాత్ముఁ డెవ్వఁడో మనరాజును మరల బ్రతికించె

ను." అని యనుచరు లెల్లరు సంతోషభరితులైరి. మిత్రుల మొగములు తెలివొందినవి. అంతఃపురకాంతల డెందము లానందతుందిలము లైనవి. ఆపన్నసేవకుల చిత్తములు ముదాయత్తము లైనవి. వందిమాగధుల వక్త్రంబులు జయశబ్దముఖరితము లైనవి. రాజవైద్యు లందఱు ధన్వంతరిప్రోక్తమగు ధాతువిజ్ఞానము నభ్యసించుట వ్యర్థమని తలంచువారైరి. దిఙ్ముఖములు మంగళవాద్యధ్వని పూరితములైనవి. అంతట నొకద్వారపాలకుఁడు సత్వరము వేత్రహస్తుఁడై వచ్చి "మహారాజా! పాటలీపుత్రమునుండి సకలశాస్త్రపారీణుఁడగు వరరుచి యను నొకబ్రాహ్మణోత్తముఁడు వచ్చి దేవరసందర్శనముఁ గోరుచు ద్వారమున వేచియున్నాఁడ"ని విన్నవింప నందుఁడు "భద్రా! యావిప్రుని శీఘ్రముగఁ బ్రవేశపెట్టు"మని యానతిచ్చెను. తరువాతఁ గొందఱు కొజ్జాలు వరరుచి నభ్యంతరమందిరమునకుఁ గొనిపోయిరి. కాత్యాయనుఁడు నందున కభిముఖుఁడై "మహారాజా! నేఁ గార్యార్థినై వచ్చితి. దేవర మఱల జీవించుటచే నిప్పుడు మహోత్సవము జరుగుచున్నది. ఇట్టి యభ్యుదయమున గురుదక్షిణకై నాకొకకోటిసువర్ణముల దయసేయుము" అని వేఁడికొనెను. యోగనందుఁ డనుమతించి వీనికిఁ గోటిసువర్ణము లిమ్మని ప్రధానమంత్రియగు శకటాలున కాజ్ఞాపించెను.

కుశాగ్రబుద్ధియగు నామంత్రిశేఖరుఁడు "దేవా! యట్లె యొనఁగెద" నని "ఇది మిగుల నద్భుతముగ నున్నది. విగతజీవుఁడైన మహారా జిప్పుడె బ్రతికెను. నేఁడె యీయాచకుఁడును వచ్చెను; ఇన్నియు నన్నియుఁ గావు, కోటిసువర్ణము లడిగెను. వెనుక ముందు లరయక యీయిమ్మని రాజాజ్ఞాపించెను." అని సంశయించుచు "ఓహో! ఇది యిట్లు. ఇతఁడు యోగనందుఁడే. సత్యనందుఁడు కాఁడు" అని జరగినట్లూహించి తనలో "ఎట్లయిన నగుఁగాక! నందమహారాజ పుత్త్రుఁడు

చిన్నవాఁడు. రాష్ట్రమున శత్రువులు పెక్కండ్రుగలరు. వారలచే వెదకించి మృతకళేబరముల నన్నింటిని గాల్పించెద. దాన నీయోగనందుఁడు చిరకాలము జీవించు" నని తలంచెను.

పిమ్మట శకటాలుని యానతిచే రాజభటులు పాడుదేవళమున వ్యాడిచే రక్షింపఁబడుచున్న యింద్రదత్తుని కళేబరము సైతము బలాత్కారమునఁ గొనిపోయి తగులఁబెట్టిరి.

ఇక్కడ యోగనందుఁడు "శీఘ్రముగ నర్థికిఁ గోటిసువర్ణము లొసంగి పంపు" మని సారెసారెకుఁ జెప్పుచున్నను, "పరిజనులందఱు మహోత్సవాకృష్టచిత్తులై యుండిరి. కావున నొకింతసేపు విప్రుఁడు నిరీక్షించుఁగాక!" యనుచు శకటాలుఁడు కొంత కాలక్షేపముఁ జేసెను. అంత వ్యాడి యోగనందునికడకు వచ్చి "మహారాజ! యోగస్థితుఁడగు నొక బ్రాహ్మణుని శవముగాఁ దలంచి యేనెంత మొఱవెట్టినను నాలకింపక రాజభటులు బలిమిం దహించిర"ని విలపించెను. అదివినుచునే శకటాలుఁడు వరరుచికిఁ గోటిసువర్ణము లొసంగెను.

పిదప యోగనందుఁడు నగుచు నేకాంతమున వ్యాడితో "మిత్రమా! నేను శ్రోత్రియకుల సంభవుఁడనయ్యు నీజన్మమునందే శూద్రుఁడనైతిని. ఎంతసంపదగల్గిననేమి?" అని పలికెను. వ్యాడియు నతని మాఱడించుచుఁ గాలోచితముగ నిట్లు నుడివెను. "కడచినదానికి వగవఁదగదు. ఇప్పుడు శకటాలుఁడు నిన్నుఁ జెంగినవాఁడు. ఇతఁడు మహామతియుఁ బూర్వనందుని పుత్త్రుఁడునగు చంద్రగుప్తునందు స్థిరానురాగము గలవాఁడునుగదా? ఆరాజపుత్త్రుఁ డభిషేకయోగ్యుఁ డయినతోడనే నిన్నుఁ గడతేర్ప యత్నించును. నీవప్రమత్తుఁడవై యుండవలయు. వరరుచిని బ్రధానమంత్రిపదమున నిల్పుము. నేనిపుడే పాటలీపుత్త్రమున కేఁగి గురుదక్షిణ నొసంగి వర్షోపాధ్యాయుని బూర్ణమనోరథుఁ గావించెద" నని యతఁడు వెడలిపోయెను.

వ్యాడి చెప్పినచొప్పున యోగనందుఁడు వరరుచిని బ్రధానమంత్రి
గాఁజేయ నతఁడేకాంతమునందు "శకటాలుఁడు మంత్రి పదమున నున్న
చో రాజ్యము స్థిరముగాదు. కావున వానినెట్లయినఁ దెగటార్పు" మని
విన్నవించెను. యోగనందుఁడు "వీఁడు యోగనిష్ఠుఁడగు బ్రాహ్మణుని
గాల్పించె" ననుదోషముఁ బ్రకటించి శకటాలుని బుత్రశతముతోఁ బా
దునాతఁ ద్రోయించి వా[illegible]యాత్రకయి ప్రతిదినము నటికెఁ డంబలి
యుండఁ బెట్టఁ గట్టడ చేసెను.

ఇట్లుతర్కితముగఁ దటస్థించిన యాపదకు వగచుచు శకటాలుఁడు
"పుత్త్రులారా! ఈయంబలి యొక్కనియాఁకలినైనఁ దీర్పఁజాలదు; కావు
న, యోగనందునిపైఁ బగ సాధింప సమర్థుఁ డొకఁడే యీయాహారము
న బ్రతుకుఁగాక" యని పలికెను. ఆమాటవిని శకటాలునికొడుకు లంద
ఱు నేకగ్రీవముగా "తండ్రీ! యట్టిమహాకార్యము నెఱవేర్ప నీవె సమ
ర్థుఁడవు. అశక్తులము మేము జీవించియున్న నేమిఫలము?" అని పలుకు
చు వారందఱుఁ దండ్రి చూచుచుండఁగనే ప్రాణములనువ దలిరి. ధీరుల
కుఁ బ్రాణధారణముకంటెను శత్రుప్రతీకారము ప్రియముగదా!

శకటాలుఁడు స్వకర్మమున కనుతపించుచు నాయంబలిచే నెట్లో
జీవించెను.

యోగనందుఁడును శకటాలుని వృత్తాంతమును మఱచి రాజ
యోగ్యములగు వస్త్రములు నాభరణములు ధరించుచు నింద్రియవశుఁ
డై యిష్టభోగముల ననుభవించుచుండెను. వ్యాడియు గురుదక్షిణ నొ
సంగి మఱల యోగనందునియొద్దకు వచ్చి "నేనింక వనమునకుఁ బోయి
తపముఁ జేసికొందు" నని చెప్పెను. పూర్వవృత్తాంతమును స్మరించి
యోగనందుఁడు "మిత్రమా! అదృష్టలబ్ధమగు నీరాజ్యమును నీవును న
నుభవింపు" మనెను.

నందశరీరము నొందిన యింద్రదత్తుని విషయవిషాస్వాదముగ్ధునిగా నెఱింగి ద్విగుణీకృత వైరాగ్యుండైన వ్యాడి "ఇట్టి యసారంబులైన భోగంబుల బుద్ధిమంతుం డెవ్వఁడు మునుంగును? మరుమరీచికయగు లక్ష్మి ప్రాజ్ఞుని మోహపెట్టఁజాలదు" అని తెలుపుచు రాజుచే [illegible]ఖిలితమ్మునఁ దిరస్కరింపఁబడి తపోవనమ్మున కరిగెను.

సాచివ్యభారమును వహించుచు వరరుచి కొంతకాలమునకుఁ జతురంగబలసమన్వితుఁడై, రాజుతోఁగూడఁ బాటలీపుత్రమునకు వచ్చెను. పిమ్మట నాతఁడు తపస్సంతోషితయగు జాహ్నవి యనుగ్రహమ్మున మహైశ్వర్యంబు నొంది, యారాధింపకయే ప్రసన్నయైన సరస్వతి రాజ్యతంత్రము లుపదేశింపఁ, దల్లియు గురువులును బహుమానింపఁ, బతిదైవతయగు సహధర్మచారిణి పరిచర్య సేయ, ననస్తుఁ డగుచునే సుఖముల ననుభవించుచుఁ బెక్కేండ్లు గడపెను.

ముఖ్యమంత్రియగు నతనియందు రాజ్యభారము నెల్ల నిలిపి యోగనందుఁడు విత్తమదమత్తచిత్తుఁడై రేయింబవళు లంతిపురమందే వసించుచు, నింద్రియార్థపరిశూన్యంబగు నొక్క క్షణమేని సహింపఁజాలక, తనకు మిగుల మూఢత గలిగినట్లు తెలిసికొనలేకపోయెను. అట్టియవస్థలో నున్న యాతనిఁ గనుఁగొని వరరుచి నిర్విణ్ణుఁడయి "ఆహా! భవితవ్య మెంత దుర్నివార మైనది. సర్వశాస్త్రపారీణుఁడు ప్రతిభావంతుఁడు శమద మాదిగుణసంపన్నుఁడు నగు నింద్రదత్తుఁ డెక్కడ? భోగాసక్తుఁడు విగతవివేకుఁడు నయి యేనుఁగువలె మదించిన యాయోగనందుఁ డెక్కడ? నవమంత్రపుసిరి యెవ్వని మోహపెట్టదు? అనుదానికి మొదటి యుదాహరణ మగున యీనరపతి యడ్డులేక సంచరించుచున్నాఁడు. రాజకార్యచింతాక్రాంతుఁడ నగు నాకు స్వధర్మము నశించు

చున్నది. కావునఁ బాడునూత నున్న శకటాలుని రప్పించి రాజకార్యా వేక్షణమున సహాయునిగాఁ జేసికొందును.” అని నిశ్చయించి రాజుతో విన్నవించి మహామతి యగు నాశకటాలుని మంత్రిపదమున నియోగించె ను. అతఁడును ‘వరరుచి యుండఁగా యోగనందుని జయింప వీలు లే’ దని తెలిసికొని సందు వెదకుచు వైతసవృత్తి నాశ్రయించి రాజ్యతంత్ర ముల నెప్పటియట్లు నిర్వహించుచుండెను.

ఒకప్పుడు రాజు వరరుచితో భాగీరథీతీరోపవనమ్మున సంచరించుచు దైవవశమున గంగామధ్యమునను శ్లిష్యత్పంచాంగుళి యగుహస్తమును గనుఁగొని ‘యిదియేమి?’ యని యడుగునంతలో మంత్రి తనవ్రేళ్లను రెండిటి నాదిక్కుగానే చూపెను. వెంటనే హస్త మదృశ్య మగుటయు నరపతి మిగుల విస్మితుఁడై మరల నడుగుటయు వరరుచి “అయిదుగురు గలసి యీజగమ్మున నేది సాధింపలేరు?” అని చెప్పుహస్తమునకు ‘ఏకచిత్తులగు నిద్దఱకే యేది యసాధ్య మగును?’ అని రెండు వ్రేళ్ళు చూపితిని. అని గూఢవిజ్ఞానమును జెప్పెను. నిరుపమాన మగు నతని బుద్ధివైశద్యమును జూచి శకటాలుఁడు విషాద మొందెను.

మఱియొకప్పుడు రాత్రులయందుఁ బట్టణముఁ బరికించుటకు నియోగింపఁబడిన రక్షకభటాధ్యక్షుఁడు రేయిరేయికి నొక్కొక్కఁడు నశించుచుండెను. అది విని నందుఁడు వరరుచినే యాయుపద్రవము గనుఁగొన నియోగించెను. వరరుచియు నర్ధరాత్రమునఁ బురవీధుల సంచరించుచు నెదురుగ వచ్చుచున్న యొకరాక్షసుని గనుఁగొని “నీకేమి యిష్టము?” అని యడిగెను. అందులకు వాఁడు ‘ఈపట్టణమునందు రూపవతి యగు స్త్రీ యెవ్వతెయో చెప్పు’ మని ప్రశ్నించెను. ఆమాటకు నవ్వి వరరుచి, ‘మూర్ఖా! ఎవతె యెవ్వని కభిమతమో వాని కాపె రూపవతి యగును.’ అని నుడివెను. రాక్షసుఁడు సంతసించి జయింపఁబడితి

ని. ఇదిమొదలు ప్రియమిత్రమ వగు నీవు తలఁచినపుడెల్ల సన్నిధి సేయు చుండునని పలికి యంతర్హితుఁ డయ్యెను. ఇట్లు జాగరూకుఁడగు వరరుచి రాజ్యకార్యము లవేక్షించుచుండ నింటఁ గూర్చుండి యభిషంగజడుఁ డైన భూపతి యున్ముఖుఁ డగు నొకబ్రాహ్మణుని గవాక్షాగ్రమునుండి నిరీక్షించుచున్న పట్టమహిషిం గాంచి వివేక పరిపంథిని యగు నీర్ష్యచేఁ గలుషితుఁడై, కోపించి యాబ్రాహ్మణుని వధింప నాదేశించెను. రాజాజ్ఞచే విప్రుఁడు వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడుచుండ నంగడివీథినడుమఁ బ్రాణము లేనిదయ్యు నొకచేఁప బిగ్గరగా నవ్వెను.

అది యెఱింగి పట్టపురాజు "బ్రాహ్మణుని జంప వల" దని వారించి "చేఁప నవ్వుటకుఁ గారణము నిరూపించి చెప్పు" మని వరరుచిని వేఁడుకొనెను. అంతఁ జింతితోపస్థితయగు సరస్వతి కాత్యాయనునితో "వత్సా! యీ లేఁతమామిడి చెట్టుక్రింద రాత్రి యెవ్వరికిఁ గనఁబడకుండఁ గూర్చుండుము. చేఁప నవ్వుటకుఁ గారణము వినఁగలవు" అని చెప్పెను. అట్లె యటనివసించిన వరరుచి, బాలకులగు పుత్రులతో నచట నివసించుటకు వచ్చిన యొక ఘోరరాక్షసి నారాత్రి చూ[illegible]తినుటకేమైనఁ బెట్టు' మని యడుగుచున్న కొడుకులశిరస్సు ని[illegible]ని యా నిశాచరి 'ప్రాతఃకాలమునందు మీకు విప్రమాంసముఁ బెట్టెదను. ఇప్పుడు వాఁడు చంపఁబడలేదు' అని యూఱడించుచు 'నతఁ డిప్పు డేలఁ జంపఁబడలే' దని వారలచేఁ నడుగఁబడి 'వాఁడు వధ్యభూమికిఁ గొనిపోఁబడుచుండఁ జచ్చినచేఁపయొకటి నవ్వె' నని చెప్పి 'యది యట్లు నవ్వుటకు గతం బే' మని మరల వారిచేఁ బ్రశ్నింపఁబడి 'పుత్రులారా! అంతఃపురమందున్న రాజస్త్రీ లందఱును భ్రష్టచారిత్రలు. అంతటను స్త్రీవేషధారు లగు పురుషులు గూఢముగా సంచరించుచున్నారు. ఇది యెఱుంగక నిరపరాధుఁడగు బ్రాహ్మణుఁ డీయభిషంగజడుఁ డగు జాల్మ

నిచేఁ జంపఁబడుచున్నాఁడని చేఁప నవ్వెనని చెప్పెను. అదీ విని వర రుచి ప్రాతఃకాలమునందు యోగనందునికెఱింగించెను. అతఁడును స్త్రీ వేషధారులగు నాపురుషులను వెదకి చంపించెను.

భూపతి యిట్లు నిరంకుశుఁడై యుండ, వరరుచియు నట్టివాని సేవను గర్హించుచుండ, నొకనాఁడు సమర్థుఁడగు చిత్రకారుఁ డొకఁడు సభామంటపమునకు వచ్చి మహాదేవీ యోగనందుల ప్రతికృతిని వ్రాసి రాజునకు సమర్పించి పరితుష్టాంతరంగుఁడగు నాతనివలన బహుధనమును బారితోషికముగఁ బడసెను. ఒకప్పుడు రాజదర్శనము సేయఁ బ్రాసాదాభ్యంతరమునకుఁ జనిన వరరుచి యొకచో నాచిత్తరువుఁ గనుఁగొని సంపూర్ణలక్షణములు గల దేవికి లక్షణాంతరము నూహించి కుంచెతో నాపె పిఱుఁదుపై నొక బొట్టు పెట్టెను. మఱునాఁడు యోగనందుఁ డాతిలకమును గనుఁగొని "ఇది కాత్యాయనునిచే వ్రాయఁబడిన" దని తెలిసికొని ముగ్ధుఁడై "నిక్కముగ నీతఁడు దుష్టచారిత్రుఁడు. నాయంతఃపురమునందు ద్రోహము సేయుచున్నాఁడు. కావుననే స్త్రీవేషధారులగు పురుషు లీతనిచే నెఱుఁగఁబడిరి.' అని నిశ్చయించి, కోపముచే మండుచు, దుర్వృత్తుఁడగు నీవరరుచిని వధింపు[illegible] శకటాలున కానతిచ్చెను. బుద్ధిమంతుఁడగు శకటాలుఁడు 'ఈతఁడు [illegible]ప్రమతిప్రభావుఁడు. ఆపదనుండి నన్నుద్ధరించినవాఁడు. ఇతనిఁ జంపుటకు సురాసురులకును శక్యముకాదు. మనుష్యుల మాటఁ జెప్పనేల?" అని చింతించుచుఁ, గాత్యాయనుఁ దనసదనమునందు నిగూఢముగా నుండఁ బంచి "మహారాజా! మీయాజ్ఞ నెఱవేర్పఁ బడినది." అని యోగనందుని సంతసపెట్టెను.

అంతఁ బెక్కునాళ్లు గడచనుటయు యోగనందునకు మహాదేవి యందుఁ బుట్టిన హిరణ్యగుప్తుఁడను పదునెనిమిదియేండ్ల ప్రాయముగల కుమారుఁడు తండ్రిచే నివారింపఁ బడుచుండియుఁ, దల్లిచే ననుమోదిం

పేఁ బడకయు, మృగయాసక్త చిత్తుఁడై కొంద ఱాప్తపురుషులు పరివేష్టింప నశ్వము నధిష్ఠించి మహారణ్యముఁ బ్రవేశించెను. అం దేకాకియై యొక యడవిపందిని వెనుకొని పరువెత్తుచుఁ జాలదూరము వోయెను. ఇంతలోఁ బవలు గడచెను. గాఢాంధకారమునందు ఘోరముగ ధ్వనిసేయు ఘాతుక మృగముల గర్జనము లాలించుటచేతనే భయభ్రాంతుఁడైన రాజపుత్త్రుఁ డొక పెద్ద చెట్టుపై కెక్కెను. తరువాత నొకగడియకుఁ దఱిమికొనివచ్చు సింగమునుండి తన్ను రక్షించుకొను నెలుఁగుబంటి యొకటి యావృక్షమునే యెక్కెను. సమీపమునకు వచ్చు దానిని గనుంగొని భయమ్మున వడఁకుచున్న హిరణ్యగుప్తుని దన తొడపైఁ గూరుచుండఁ బెట్టుకొని యా భల్లూకము "మిత్రమా! భయపడకు" మని మనుష్యవాక్యమున బుజ్జగించెను. తరువాత నా యెలుఁగు సింహముచేఁ బ్రార్థింపఁ బడియు విశ్వాసమునఁ దన తొడపై నిదురించుచున్న రాజపుత్త్రుని గ్రిందఁ బడద్రోయ నిచ్చగింపదయ్యెను. మఱికొంతసేపటికి మేల్కాంచి రాజనందనునంక ముపధానముగా నదియు నిదురించెను. కేసరిచేఁ బ్రలోభితుఁడై హిరణ్యగుప్తుఁడు నిష్కారుణముగా నాయెలుఁగుఁగొడ్డును భూమిపైఁ బడఁద్రోసెను. దైవవశమున మేల్కాంచిన యాభల్లూకము త్రోయఁబడియుఁ బట్టు వదలక కోపించి 'ఓరీ! మిత్రద్రోహీ! ఈ నీదుష్ట చేష్టితము వెల్లడియగునంతవఱకు నున్మత్తుఁడవై యుండు' మని శపించెను.

ప్రాతఃకాలమునం దున్మత్తుఁడై పురమున కరుదెంచిన కుమారుని గనుఁగొని విషణ్ణహృదయుఁడైనభూపతి సుతునకు స్వస్థత గలుగునుపాయం బరయఁజాలక 'వరరుచి యిప్పుడు బ్రదికియుండునేని యున్మాదహేతువు తెలియునగుఁగదా! నేనాతని జంపించి యెంతకొఱఁతఁ దెచ్చుకొంటిని.' అని తన్ను నిందించుకొనెను. చెంతనున్న శకటాలుఁడు మేలు!

వరరుచిని వెల్లడించుటకుఁ దగినసమయము వచ్చెన' దని చింతించి యా రాజు సభయము వేఁడికొని యాతని యానతి వెంబడి నేకసంధాగ్రాహిని బయలుపఱిచెను. తోడ్తోన యోగనందునిచేఁ గుమారోన్మాదకారణము నడుగఁబడి కాత్యాయనుఁడు హిరణ్యగుప్తుని జూచి 'యీతఁడు మిత్రద్రోహముజేసెను. దాని కిది ప్రతిఫల' మని సరస్వతీప్రసాదమునఁ జెప్పెను. తత్క్షణము హిరణ్యగుప్తుఁడు స్వస్థుఁడయి జనశూన్య మగు నరణ్యమున జరిగినవృత్తాంతమును సాకల్యముగ నభివర్ణించెను. రాజు విస్మితుఁడై 'ఓయి! నీకిది యెట్లు తెలిసినది' అని యడుగ వరరుచి 'దేవా! ప్రజ్ఞావంతులు లక్షణములఁ, బ్రతిభ, ననుమానమున' నొరులు చెప్పకయ సర్వము నెఱుంగఁ గలరు. మున్ను నేనిట్లే తిలకము నెఱిఁగితి'' నని పలికెను. లజ్జానుతాపములు గదిరి తూష్ణీంభావము నొందిన యోగనందునిచే సత్కరింపఁబడక, తనచారిత్రశుద్ధి ప్రకటితమయినందులకే తన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచుచు, నుపకోశాభర్త విరక్తుఁడై 'అనిత్యముకంటె ననిత్యమగు రాజానుగ్రహ మింకఁ జాలు' నని తలంచి తన యింటి కరిగెను.

వచ్చినయల్లుని గని సముద్భ్రాంతచేతనుఁడైన యుపవర్షుఁడు 'విద్వాంసుఁడా! నీకు విధింపఁబడిన వధదండనమును విని పతివ్రత యగునా కూఁతురు శోకదగ్ధయు నవిరళాశ్రుధారాపరిప్లుతలోచనయు నై నాచే నివారింపఁబడుచుండియు నగ్నిప్రవేశ మొనరించెను. జరాభారజర్జరితావయవనై 'హా! కాత్యాయన! హా! సకృచ్ఛ్రుతధర! యని విలపించు నీ జనయిత్రి హృదయము తనంతనే పగిలిపోయె' నని బిగ్గరగ నేడ్చెను. కాత్యాయనుఁ డది విని నూతనమగు దుఃఖవేగమున నొడలెఱుంగక మొదలు నఱకఁబడిన చెట్టువలె భూమిపైఁ బడి పెద్ద తడవు విలపించెను. ప్రియబంధువినాశమునఁ గలిగిన శోకాగ్ని యెవ్వనిఁ బరితాపపెట్టదు?

అంత వరరుచియవస్థను విని వర్షోపాధ్యాయుఁడు శీఘ్రముగ వచ్చి 'వత్సా! యేమి యిట్లు ప్రాకృతజనునట్లు ధర్మసూక్ష్మ మెఱుంగనివాని భంగి, నవిద్వాంసునివడువున, ననధిగత లోకవృత్తాంతునిపోల్కి దుఃఖాక్రాంత మగు హృదయమును మఱలింపకుంటివి? నీవు పుట్టిననాఁటఁగోలె శోకము నెఱుంగనివాఁడ వగుట నిజమే. ఇది యైనను నీవైరాగ్యమును దృఢపఱుచుటకు నీవతిభక్తి నారాధించు దైవముచేఁ గల్పింపఁబడినది. కావున ధైర్యము నవలంబింపుము. మనముఁ గుదురుపఱుచుకొనుము. లోకతత్త్వమును విచారింపుము. ఈజగమునందు సంసార మున్నంతవఱకు నొక యనిత్యతయే నిత్య మైనది. కావున నీశ్వరమాయ నెఱింగియు మోహపడెదవేమి?" అని పెక్కుతెఱఁగుల బోధించెను. ఇట్లు వర్షోపాధ్యాయునిచేఁ బ్రబోధితుఁడై వాక్యకారుఁడు విషాదముఁ దొలఁగఁద్రోసి విరక్తహృదయుఁడుఁ బరిత్యక్తసర్వబంధనుండునై శాంతి యొక్కటియే తనకు సహాయముగఁ దపోవనము నాశ్రయించెను.

అంతఁ గొంతకాలము గడచనుటయుఁ బుణ్యారణ్యవాసముఁ జేయుచున్న వరరుచి దైవవశమున మగధదేశమునుండి యచ్చటికి వచ్చిన యొకబ్రాహ్మణుని జూచి, యోగనందుని వృత్తాంతము నడిగెను. అతఁడును గాత్యాయనుని గుఱుతుపట్టి నమస్కరించి 'మహాశయా! నీవు తపోవనమున కేఁగినతోడన యవకాశముఁ గొని వైరము నెంచి శకటాలుఁడు యోగనందుని వధించు నుపాయము నరయుచు భూమిని ద్రవ్వుచున్న చాణక్యుఁ డను నొక బ్రాహ్మణుని గనుఁగొనెను. "ఎందుల కిట్లు త్రవ్వెద" వని మంత్రిచే నడుగఁబడి యావిప్రుఁడు "నా పాదము నీదర్భ తెగఁ గోసినది. కావున దీనిని గూఁకటివేళ్ళతోఁ గూడఁ బెఱికివేయక పోవ" వని పలికెను. క్రూరనిశ్చయుం డగు నితఁడు సహాయుఁడగునేని నామనోరథము సిద్ధించునని తలంచి శకటాలుఁ డాతని సన్మా

నించి తన గృహమునందె యుండఁ బంచి నందమహారాజు ప్రాసాదమున లక్షసువర్ణములు దక్షిణగాఁ గల త్రయోదశీశ్రాద్ధమ్మున నిమంత్రితులగు బ్రాహ్మణుల యగ్రభాగమున నాతని నియోగించెను. రాజునకిష్టుఁ డగు సుబంధువను బ్రాహ్మణుఁ డా స్థానమునే యభిలషించెను. నందునిచేఁ బూర్వనియుక్తుఁ డయ్యుఁ జాణక్యుఁడు బలాత్కారముగా నగ్రాసనమునుండి తఱుమఁబడెను. అంతఁ గోపమ్మున మండుచుఁ జాణక్యుఁడు తల విరియఁ బోసికొని "పదునేనుదినములలో దుర్వినీతుఁడు, నైశ్వర్యమత్తుఁడు, నగు నీ రాజును గడతేర్చి యీతల ముడిచికొందు" నని ప్రతిజ్ఞఁ జేసెను. ఆచాణక్యుని గూఢముగఁ దనగృహమునం దుంచి యాతఁడు కోరిన యుపకరణములనెల్ల శకటాలుఁ డొసంగెను. అతికోపనుఁ డైన యా విప్రుఁడును నత్యుగ్రము లైన యథర్వమంత్రములఁ బఠించి యొక కృత్యను సాధించెను. ఆకృత్యచే గ్రసింపఁబడిన యోగనందుఁడు తీవ్రమగు దాహజ్వరమునఁ బరితప్తుఁ డయి యేడవనాఁటనే పరలోకమున కరిగెను. శకటాలుఁడును దోడనే హిరణ్యగుప్తుని జంపి పూర్వనందసుతుఁ డగు చంద్రగుప్తునకుఁ బట్టాభిషేక మొనరించి చాణక్యుని మంత్రిపదంబున నియోగించి కృతప్రతిక్రియుఁ డై పుత్రశోకమ్మునఁ దూలుచు మహారణ్యమున కేఁగె" నని చెప్పెను.

ఇట్లతిశోచనీయ మగు యోగనందుని వృత్తాంతము విని వరరుచి మిగుల ఖిన్నుఁడయి, సంసారము నసారముగ నెంచి, వింధ్యవాసిని యగు దుర్గాదేవి నుపాసించి యామె యాజ్ఞచే వ్యాఘ్రవానరసంకీర్ణము గహనము నగు వింధ్యారణ్యమ్మునఁ బరిభ్రమించుచు నొకచో నున్నత మగు వటవృక్షమును జూచెను. ఆచెట్టుక్రింద ననేకపిశాచములు పరివేష్టింప నున్న కాణభూతియను బేతాళుం గాంచినతోడనే పూర్వజన్మస్మృతి గలిగి యా కాణభూతి "కుబేర శాపంబునఁ జేసి పిశాచత్వము నొం

దిన సుప్రతీకుఁ డను గుహ్యకుఁ డనియుఁ, బుష్పదంతుఁ డన నొప్పు దనకు మిత్ర మనియుఁ దెలిసికొని” మైత్రిఁ జూపి యతనికి విద్యాధరచరితముఁ జెప్పి 'మిత్రమా! శీఘ్రకాలములోనే గుణాఢ్యుఁ డిక్కడకు వచ్చును. అతని కీయపూర్వమగు కథ నెఱింగింపుము. పిమ్మట నీకు శాపవిమోచన మగును.' అని బోధించి శరీరమోక్షమునకై పవిత్రతమమగు బదరికాశ్రమమునకుఁ బయనించెను.

హిమాలయప్రాంతవనమ్ముల సంచరించుచుఁ గాత్యాయనుఁడు కందమూలఫలాదుల జీవయాత్ర నడపుచు శాకరసుఁడను సార్థకనామధేయముగల మునీశ్వరుఁ గాంచి యాతనిచే నతిథి పూజ నొంది యతనిజ్ఞానమును బరీక్షించుతలఁపున వరరుచి దర్భక్షతమగు నతనికరతలమునుండి స్రవించు రక్తధారను శాకరసముగాఁ బరిణమింపఁజేసెను. మునియు నది చూచి నాతపము ఫలించిన దని గర్వించెను. కాత్యాయనుఁ డాయహంకారము జ్ఞానమునకు శత్రువని యాతనికిం దెలిపి, నీవిజ్ఞానము నెఱుంగఁగోరి రక్తధారను శాకరసముగా నొనరించితిని. ఓమునీశ్వరా! నీచే నిప్పటికి నహంకారము విడువఁబడ లేదు. జ్ఞానమార్గము నందహంకారము దురతిక్రమ మగు పరిఘము. జ్ఞానములేక యెన్ని వ్రతము లొనరించినను మోక్షములేదు. అనిత్యమగు స్వర్గముగూడ ముముక్షువులచిత్తమును లోభపెట్టఁజాలదు. కావున నహంకృతిని విడిచి విజ్ఞానమును సంపాదింప యత్నింపుము. అని మోక్షరహస్యము నుపదేశించి యాతనిచేఁ బ్రణామపూర్వకముగఁ గొనియాడఁబడి బదరికాశ్రమభూమి కరిగెను. అందు శరణ్య యగు పార్వతి నుపాసించి తత్ప్రసాదమున వరరుచి దివ్యగతి నొందెను.

---

# ✓* కుమారిల భట్టాచార్యుఁడు

ఉపనిషత్తులలోనె "దేహాత్మవాదము" పేరితో నవైదిక మతచిహ్నములు గలవు. ఆయవైదికమతప్రవర్తకులగువారిని గాలాంతరమున "తీర్థంకరులు, లేక జినులు' అనియు, నామతమునకు (1) జైనమతమనియు నామములు కలిగెను. ఆతీర్థంకరు లిరువదినల్వురు కలరు. ఆయిరువదినల్వురిలో నిరువదిమూఁడవ తీర్థంకరుఁడగు 'పార్శ్వనాథుని మనయాంధ్రదేశమునందు జైనమతస్థులగు 'మారువాళీలు' సేవించుచుందురు. ఇరువదినాల్గవ తీర్థంకరుఁడగు 'మహావీరుఁడు' బుద్ధునకు సమకాలికుఁ డనియుఁ బేహారురాష్ట్రమున నాతఁడు తనమతప్రచారముఁ జేసెననియుఁ .జారిత్రికులు చెప్పుదురు.!

ఆజైనమతము జనసామాన్యమున కందుబాటగు ధర్మములు కలదిగా మహావీరునిచే మార్పఁబడినందున బేహారు, కళింగాది దేశములలో నతివ్యాప్తి నొందెను. 'ఖారవేలుఁ'డను కళింగదేశపు మహారాజే జైనమతము నభివృద్ధి నొందించుటకై 'కళింగోత్కల' దేశములలో విశేష దానధర్మముల నొనర్చెను. (2)

అందువలనఁ గళింగోత్కల విహారాదిదేశములలో వైదికమతము నామమాత్రావశిష్టమయ్యెను. ఏయెడఁ జూచినను జైనబౌద్ధమతముల విజృంభణమే కాన్పించుచుండెను.

---

* ఈచరిత్ర శంకరవిజయాదిగ్రంథములఁ బరిశీలించి వ్రాయఁబడినది.

(1) జైనమతము నాల్గువిధములగు బౌద్ధమతభాగములలో నొకటి యని వేదాంతశాస్త్రజ్ఞు లనెదరు.

2. ఖారవేలుఁడు పాటలీపుత్రాధిపతియు అశ్వమేధయాగ మొనర్చి వైదికమతాభివృద్ధి నొనర్చిన పుష్యమిత్రునిపైకిని, ప్రతిష్ఠాన పురాధీశుఁడు నాంధ్రప్రభువు నగు 'శాతకర్ణి' మహారాజుపైకిని దండయాత్ర లొనర్చుట జైనమతవ్యాప్తికే యని తోఁచును. ఈయంశములు హాతిగుంఫాశాసనముల వలనఁ దెలియనగుచున్నది. పైయంశములు క్రీ. పూ. 156సంవత్సర ప్రాంతమునకై యుండెను.

ఇట్లుండినను వైదికమతాభిమానము, వైదికవిద్యాభ్యాసము దేశమున నచటనచటఁ బొడసూపుచునే యుండెను. ఆజైనమతాతిరేక కాలముననే, ఆంధ్రోత్కల దేశములనడుమను మహానది యను నొకయేటి యొడ్డున (1) 'జయమంగల'మను గ్రామమునందు 'తైత్తిరీయవేద' శాఖకుఁ జేరిన "చంద్రగుణా యోగీశ్వరభట్టు" లను విప్రదంపతులకుఁ (2) 'కుమారిలుఁడు' అను బాలుఁ డుద్భవించెను. దుర్మతనిర్మూలనమునకై శివునాజ్ఞచేఁ గుమారస్వామి కుమారిలభట్టుగా జన్మించె నని శంకరవిజయమునఁ గలదు.

'కుమారిలుఁడు' చిన్నతనమునుండియు మేధాశాలియై వేదవేదాంగములం గఱచి తోడివిద్యాంసులలో మిన్నగ మెలఁగెను. అతనికి వేదబాహ్యమగు జైనముపై నీర్ష్య మెండయ్యెను. కాని యామతమును ఖండించుటకు జైనులు తమమతగ్రంథముల నితరులకుఁ జూపనివారగుటచేత నామతమును శాస్త్రయుక్తముగా ఖండింప వీలు కలుగలేదు. (3) అందువలనఁ గుమారిలుఁడు జైనబ్రహ్మచారి వేషమును ధరించి జైనపండితులకడ నామతగ్రంథములను జదివి యందలిమర్మములను గ్రహించెను.

అతఁడు జైనగురువులకడ మారువేషముతో విద్య నేర్చుచుండ నొకఁ డెట్లో యాతనిరహస్యముఁ దెలిసికొని మేడపై నిద్రించు నాతనిని

1. జయమంగలగ్రామము గంజాము మండలమున 'బరంపురము, అస్కా' పట్టణములకు నడుమఁగలదు. మహానది యనునది చిన్నయేరై ఋషికుల్య కుపనదిగా నున్నది.

2. కుమారిలభట్టు క్రీ. త. ఏడవ శతాబ్దములోనివాఁ డని యాధునిక చారిత్రకులును, యుధిష్ఠిరశకము 2110 సం॥రము అనఁగా క్రీ. పూ. 991 సం॥రమున జన్మించెనని సనాతన ధర్మచారిత్రకులును వ్రాయుచున్నారు.

3. జైనులితరులకుఁ దమగ్రంథములఁ జూపనందునఁ దదితరులు జైనులను నిర్గ్రంథులనిరి. కాని, నేఁటికాలమున జైనమత గ్రంథములు పందలకొలఁది ముద్రితము లయినవి.

గ్రిందికిఁ ద్రోసివేయ గ్రిందికి పడునప్పు డీతని కొకకన్నుపోయెనఁట !

జైనమతఖండనమునకును వేదప్రతిపాదిత కర్మములే ముక్తిసాధనము లనుటకును 'జైమిని మహర్షి' కృత మగు పూర్వమీమాంసాశాస్త్రము నాధారపఱచికొని కుమారిలుఁడు ప్రచార మారంభించెను.

ఆకాలమున కుమారిలభట్టాచార్యుఁ డుండు దేశమును 'మేదినీ' పురాధీశుఁడగు 'సుధన్వ' మహారాజు పాలించుచుండెను. ఆరాజాస్థానమునకుఁ బలువురు జైనమతపండితులు చేరి యామహారాజును వైదికమతవిముఖునిగాను, జైనమతాభిమానునిగాను జేసిరి. రాజాదరణము లేనందున వైదికకర్మములు సంస్థానమున సన్నగిలెను. కాని, సుధన్వమహారాజుభార్య సనాతన వైదికమతాభిమానిని; విదుషీమణి; సత్స్వభావ. భర్త జైనమతావలంబి యగుట కెంతయు వగచి, భర్తతో మతవాదమునకుఁ గడంగునుగాని జైనమతపండితులు చెప్పు వైదికమత ఖండనోపదేశములను వినినభర్త చెప్పు యుక్తులకుఁ బ్రత్యుక్తులు చెప్పలేకుండును. కాని, వైదికధర్మమే యుక్తధర్మ మనునమ్మిక కలదగుటచే జైనమతమును ఖండించుపండితుఁ డెవ్వఁడైనఁ గలుగకపోవునా ? అని తలంచుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు కుమారిలుఁడు మేదినీపురమున కేఁగుటయు, మహారాణియొక్క మేడకు సమీపమున నడచుచుండుటయుఁ దటస్థించెను. సదా వైదిక మతోద్ధారణమునే యోచించుమహారాణినోఁట నీక్రిందియర్థముగల పద్యభాగము వెలువడెనఁట!

1 ఏమి చేయుదాన; నెచటి కేఁగుదాన?
వేదముల నెవఁ డుద్ధరింపఁగలఁడు?

అన నది విని యెట్లయినను రాజసభకుఁ బోయి జైన పండితుల నోడింపుసమయమునకు వేచియున్న కుమారిలుఁడు వెంటనే యిట్లు ప్ర

---

1. కిం కరోమి, క్వగచ్ఛామి, కో వేదానుద్ధరిష్యతి.

త్యుత్తరముగా నామె నుడివిన పద్యమును బూర్తి చేసెనఁట!

1 సుందరీ! చింత మానుము; నేను భూతల
మున భట్టాచార్యుఁడనై యుంటిని.

ఈప్రత్యుత్తరముచే మహారాణి యాశ్చర్యానందభరితయై కుమారిలుని దన సౌధముపైకి రప్పించి యాతని వృత్తాంతముఁ దెలిసికొని, యాతఁడు తప్పక జైనుల నోడింపఁగలఁ డని తలఁచి, బహూకరించి కుమారిలునకు రాజసభాప్రవేశము గలుగు నవకాశముఁ గల్పించెను.

రాజదర్శనానంతరము కుమారిలభట్టుఁడు రాజసభకువచ్చి పోవుచు నొకప్పుడు రాజసభలోనుండ సభాసమీపమున నొక రసాలవృక్షముపై నున్న కోయిల కుహూరుతము సేయ నది నెపముగఁ గుమారిలభట్టాచార్యుఁ డీక్రిందియర్థముగల శ్లోకముఁ జదివెనఁట!

(2) ఓపికమా! నీచములై మలినములై నిందితపు కఱకుపలుకులుగల కాకకులముతో నీవు కలియకుంటి వేని యపుడు శ్లాఘనీయ మగుదువు.

అన నాపద్యార్థము, నీచులైన యయుక్తవాదులగు జైనులచే మహారాజావృతుఁడు కాకుండిన నాతఁడు కొనియాడఁదగినవాఁ డను నంశమును స్ఫురింపఁజేయ మహారాజు చిన్నవగు మోముగలవాఁ డయ్యెను. రాజు నిట్లు పలుకుటచే సచివాదు లుద్విగ్నమానసులైరి. జైనపండితులు క్రోధావేశపరవశులైరి. సభాసదులు గుసగుసలతో గజిబిజి పడిరి.

అంత వయోవృద్ధుఁడు, విద్యావృద్ధుఁడు, సర్వసముఁడు నగు నొక్క మహాపండితుఁడు సభలో నిలిచి సభలోని కలకలమును వారించి

---

1. మానిషీద, వరారోహే! భట్టాచార్యోస్మి భూతలే.

(2) శ్లో. మలినై శ్చేన్నసంగస్తే నీచైః కాకకులైః పిక !
అతిదూషకనిర్హ్రాదైః శ్లాఘనీయస్తథా భవేః ॥

"ప్రభువర్యా! సభాసదులారా! జినమతము దుష్ట మనియు, వైదికమత మత్యుత్తమ మనియు నీభట్టాచార్యునితలంపు. జైనపండితులు తద్వ్యతిరేకులు. అదియే యిప్పటి కలవరమునకుఁ గారణము. కాన వీరిరువురమతధర్మములు శాస్త్రదృష్టాంతములుగల వాదప్రతివాదములచే నిర్ణయించుకొందురుగాక!" అని పలుక నందులకు మహారా జంగీకరించి యొక్కనాఁడు సభ నేర్పఱచెను.

ఈవృత్తాంతము నలుగడల వ్యాపింప నుభయమతాభిమానులగు పండితులు పలుదిక్కులనుండియు మేదినీపురమునకు రాఁదొడంగిరి.

నియమితదిన మేతేర రాజపురుషులు పండితు లగుసభ్యులకును, జూపఱులకును దగినయేర్పాటుల నొనరించిరి. పండిత మండలాగ్రగణ్యులు నిర్ణీతస్థానముల నలంకరించిరి. ఖండన మండనములం జేయఁదలఁచిన భట్టాచార్యాదు లిష్టదైవములఁ గొలిచి సభలోఁ బ్రవేశించిరి. మహారా జనర్ఘమణిస్థగితసింహాసనమున నారూఢుఁ డయ్యెను. విదుషీమణియగు మహారాజ్ఞియు వాదోపవాదములు విన సభలో నుచితస్థలమునఁ గూర్చుండెను.

పిమ్మట జైనవైదికమతవేత్త లగు మహాపండితులను మధ్యవర్తులనుగా నెన్నుకొని కుమారిలుఁడును, జైనపండితులలో శ్రేష్ఠుఁడగు నాతఁడును వాదమునకుఁ గడంగిరి.

"వేదోదితకర్మములే యాచరణీయములు, తద్వ్యతిరేకములు త్యాజ్యములు" అని కుమారిలభట్టాచార్యుఁ డుపపా దించెను. "వేదములు పౌరుషేయములు. అందుఁ జెప్పఁబడు యజ్ఞాదికర్మములు హింసాత్మకములుగాన వేదకర్మము లనాచరణీయములు. అహింసాత్మకములగు జైనధర్మములనే యాచరింపవలయు" నని జైనపండితుఁడు ఖండించెను.

అందుపై (1) "విధివాదము, అణువాదము, వ్యక్తివాదము శక్తివాదము, క్రోడవాదము, స్ఫోటవాదము, ప్రక్రియావాదము, ఆర్థికవాదము" మొదలగు వివిధశాస్త్రసంబంధములగు వాదములు, ఖండనమండనములతోఁ జెలఁగెను.

వారివాదములలో "వేదములు, షడ్దర్శనములు, షడంగములు, సౌగతము, చార్వాకము" మొదలగు వివిధశాస్త్రములు చక్రాకృతిని గిఱ్ఱునఁ దిరుగుచుండెను. మేదినీపురమహారాజుసభ వేదశాస్త్రఘోషములతో సముద్రమురీతి నుప్పొంగుచుండెను. సభ లేనప్పుడును, నుభయపక్షముల పండితులనివాసములలోను బెక్కు లుపసభలు జరుపుచుఁ బండితులు తమతమ పక్షపునాయకుల కాలోచనములఁ జెప్పుచుండిరి. ఆ సభాముఖమున నందఱుపండితులలోను కుమారిలుని యుక్తిప్రత్యుక్తులు సర్వశాస్త్రపండితులకు ముఖపిధానముల గల్గించెను. షణ్ముఖునివలె నతని ముఖమునుండి వాగ్ఝరి నలుదిక్కుల విస్తరిల్లెను. అందులకే కాఁబోలుఁ గుమారిలుని కుమారస్వామియొక్క యవతారమనిరి! అతని వాగ్బాణముల కెదుర నేవిపక్షపండితులును నిలువలేరైరి. అతని శాస్త్రహుంకృతులకు విమతస్థులు సమ్మోహితులై "జితాస్మః" అనిరి.

మధ్యవర్తులగు పండితులు కుమారిల భట్టాచార్యునికే జయపత్రి మొసఁగిరి. సుధన్వమహారాజును జైనమతమును ద్యజించి వైదికమతావలంబియై కుమారిలుని గురువుగా గ్రహించెను. నిరావలంబులైన జైనమతగురువులుఁ దన్మతపండితులు నాదేశమును వదలి దూరప్రదేశముల కేఁగిరి. అంతకుమున్ను జైనమతము నవలంబించిన జనులు జినమతమును వదలి వైదికమతము నవలంబించిరి.

1, పైవాదములు హైందవుల శాస్త్రచర్చలలోఁ గలుగును.

కొందఱు చారిత్రకులు సుధన్వమహారాజు కుమారిల భట్టాచార్యుని యుపదేశముచే జైనుల నాదేశమునుండి తరిమివేసె నని చెప్పుదురు.

ఇట్లు కుమారిలభట్టాచార్యుఁడు జైనమతఖండన మొనర్చి తాఁ జేసినప్రతిజ్ఞను నిర్వహించినవాఁ డగుటవలన మహారాణిచే విశేషసత్కారముల నొందెను.

పిమ్మట నాపండితుఁడు జైమినిప్రోక్త పూర్వ మీమాంసాసూత్రములకు "తంత్రవార్తికభాష్యము, శ్లోకవార్తికము" మొదలగు మహాగ్రంథములను జేసెను. ఆతనికి శిష్యప్రశిష్యులగు "ప్రభాకరభట్టు, పార్థసారథిమిశ్రుఁడు" మొదలగువా రెన్నియో యుద్గ్రంథములను, కుమారిలభట్టాచార్యునిమతమును సమర్థింపుచు రచించి బ్రాహ్మణమతమును, వైదిక విద్యను నలుదిక్కుల వ్యాపింపఁ జేసిరి.

కుమారిలభట్టాచార్యుని యత్యధిక పాండిత్యమును, వైదికమతప్రచారమును, జైనమతనిర్మూలనమును జూచి "జినవిజయము" అనుగ్రంథ మొనర్చినయాతఁడు తనగ్రంథమున నిట్లు వ్రాసెను.

(1) "ఆంధ్రోత్కలదేశముల సంధియందు మహానదీతీరమునందుండిన పవిత్రమైన 'జయమంగల' గ్రామమున "చంద్రగుణా యజ్ఞేశ్వరులు" అను నుత్తమదంపతులకు మహావాదియు, విపక్షభయంకరుఁడును, వేదాభిమానియు, జినమతాంతకుఁడును, గురుద్వేషియు, నాంధ్రుఁడును, 'తైత్తిరీయ' వేదశాఖీయుఁడు నగు కుమారిలభట్టాచార్యుఁడు పుట్టెను."

---

1. ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగళే. గ్రామే తస్మిన్మహానద్యాం భట్టాచార్యః కుమారకః॥ ఆంధ్రజాతిస్తైత్తిరికో మాతా చంద్రగుణసతీ. యజ్ఞేశ్వరః పితా యస్య...మహావాదిర్మహాఘోరః శ్రుతీనాంచాభిమానవాన్ జినానామంతకస్సాక్షాత్! గురుద్వేష్టాతి పాపవాన్.

ఈమహానుభావుఁ డొకప్పుడు జైనమతబోధలవలన వేదమును బౌరుషేయముగాఁ దలఁచెనఁట! జైనమతమును మారువేషముతో నేగురువులకడ నేర్చెనో యాగురువులనే రాజసభలో నోడించి దేశభ్రష్టులగునట్లు చేసి గురుద్రోహి యయ్యెనఁట!

ఆరెండు మహాపాపములకుఁ బ్రాయశ్చిత్తముగాఁ గేవల కర్మబ్రహ్మవాది యగు నీ మహానుభావుఁ డంత్యకాలమునఁ "బ్రయాగమహాక్షేత్రము" నందు 'తుషాగ్ని' లోఁ బడి యసువులను విడిచెనఁట !

ఈతఁడు తుషాగ్నిలోఁ బ్రవేశించునాఁటికే శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవా రాస్థలమునకుఁ జేరి కుమారిలభట్టాచార్యుని దుషాగ్నినుండి వెలువరించుట కెంతేని యత్నించెను. కాని, కుమారిలుఁడు మనస్సాక్షికి వ్యతిరేక మొనర్ప నిష్టపడక కేవలబ్రహ్మవాదియగు శంకరునిసన్నిధినే దివంగతుఁ డయ్యెనని శంకరవిజయమునఁ గలదు.

ఆంధ్రజాతియం దుద్భవించిన 'యాపస్తంబమహర్షి' కిఁ బిమ్మట నతని కీడైన యాంధ్రుఁడు కుమారిలభట్టాచార్యుఁడే. ఆపస్తంబుఁ డాంధ్రపిత. కుమారిలభట్టాచార్య డాంధ్రుల కగ్రసోదరుఁడు.

---

## * తెలుఁగునాఁటి తురుష్క-యోగి



తెలుఁగునాఁటిని బరిపాలించిన మహమ్మదీయ ప్రభువులలో "కులీ కుతుబ్ శాహి" పుత్రుఁడగు "ఇబ్రహీం కుతుబ్ శాహి" యగ్రగణ్యుఁడు. ఈతనినే "మల్కి-భరాం" అని యాంధ్రకవులు నుడివి

*ఇది క్రీ. శ. 1550—1580 వఱకు గోలకొండను రాజధానిగాఁ జేసికొని త్రిలింగదేశమును బాలించిన "ఇబ్రహీం కుతుబ్ శాహి" కాలమున జరిగి యుండెనని మాతండ్రిగారివలన వినియున్నాను.

యున్నారు. ఈధర్మప్రభువు హిందూమహమ్మదీయమతములను రెండిం టిని సమానముగ నాదరించెను. చెఱువులు, ఆనకట్టలు మొదలగు వ్యవ సాయోపయోగకరకార్యము లొనరించి దేశమును సుభిక్షముగఁ జేసెను. మతసంస్థలను బోషించెను. అనేకసత్రములను బాఠశాలలనుబెట్టించెను. అన్నిటికంటె నాంధ్రులు శాశ్వతముగఁ బొగడఁదగిన దీతని యాంధ్ర భాషాపోషణము. ఈతనికాలముననె మహమ్మదీయులును నాంధ్రకవిత్వ మును బోషింతు రనుప్రథ కలిగెను. అందులకు నిదర్శనము "అద్దంకి గంగాధర మహాకవిచే" నీతఁడు కృతి నందిన తపతీసంవరణమహా కావ్యమే!

మఱియు నీతని సైన్యాధీశుఁ డగు "అమీన్‌ఖాను" అను మహ మ్మదీయప్రముఖుఁ డాంధ్రవాఙ్మయమున నాది యగు నచ్చతెలుఁగు కబ్బమును గృతి నొందెను. అది పొన్నిగంటి తెలగనార్యకృత మగు య యాతిచరిత్ర. "యథారాజా తథాభృత్యా" అను నానుడి యిట సార్థక మయ్యెఁగదా! మల్కిభరాం తన దండయాత్రలయందును బెక్కండ్ర కవులను గూడ వినోదముగాఁ దీసికొని పోవుచుండువాఁ డఁట!

ఇట్టి విశాలహృదయుఁడును, దేశభాషాపోషకుఁడును, సర్వమత సహిష్ణువు నగు మల్కిభరాం కాలమున నీక్రిందికథ జరిగె నఁట!

అతనికాలమున గోలకొండలో సర్వసంగపరిత్యాగియు, సర్వశా స్త్రజ్ఞుఁడును, మహాభక్తుఁడు నగు ఫకీరు (మహమ్మదీయ సన్యాసి) యుండెను. అతఁడు సభక్త్యన్మేషుఁడై గానము చేయునపుడు వాయిం చుకొనుటకు "ఖంజరి" యను వాద్యవిశేషమును, భిక్షాన్నమును స్వీక రించుట కొకకొబ్బరిచిప్పయు, ధరించిన కౌపీనవస్త్రమును గాక మఱి యొక యుపకౌపీనము మాత్రమె వానిధనములు. శాస్త్రీయముగ నేమ సీమనమో సకాలమున నమాజులు చేయుచు, తుష్టిపడితుఁ డైనపుడు మా

ధుకరాన్నముచే క్షుద్బాధ నడఁచికొనుచు, నేమఠముననో శీతవాతా తపబాధలఁ దీర్చుకొనుచుఁ గాలక్షేపముఁ జేయుచుండెను. అతఁడు గోలకొండయందే జన్మించి దీక్ష నొందిన యాంధ్రుఁ డగుటచేఁ దెనుఁగు నాఁడుననే తెలుచు సంచరించువాఁడు. అట్టియాతని కొకసమయమున, "శాస్త్రము లసత్యములు కావు; పరమేశ్వరుని నమ్మినవాని కెట్టి దుష్క రకార్యములైనను సుకరము లగును" అనునంశము లోకమునకుఁ జూపిం పవలయు నను తలంపు కలిగెను.

అందులకై యాకిర్రిందిరీతిని దలంచెను. "ఈదేశ మేలుపాచ్ఛా (మహామ్మదీయప్రభువు) కూఁతును నేను బెండ్లియాడుదు ననిన నెవరును నమ్మరు. అట్లు చేయుదు నంటి నేని నాకు బహుబాధలును గలుగవచ్చు ను. అది లోకమునకు సద్బోధక మగుఁగాక!" అని తలంచి, మఱునాఁ టియుదయమునఁ గాల్యకరణీయములు నిర్వర్తించి ఖంజరిని వాయించుకొ నుచుఁ బట్టణమున సంచరింపుచు, "పాదుసాగారి కుమార్తెను నేను వివాహమాడుదు నోహో!" యని కేకలు వేయ నారంభించెను. "అది యేమి" యని పౌరు లడుగగాఁ "నేనీ గోలకొండ నవాబుగారి కుమారి తను బెండ్లియాడెద" నని చెప్పనారంభించెను. అది విన్నవారందఱు నవ్వసాగిరి. కొందఱు హేళనము చేసిరి. మఱికొందఱు మందలించిరి. ఫకీరు పిచ్చివాఁ డని కొంద ఱనిరి. ఆఫకీరాపట్టణముననె కాదు, ఆరాజ్య ములోని యన్నిపత్తనములలోను గ్రామములలోను మూలమూలల నున్న పల్లెలలోను గూడ నట్లు చాటించెను. దానికి నేరాన్వేషకులవలన రాజ పురుషులు తెలిసికొని కినిసి "యమర్యాదాకరముగ సతఁడు వర్తించుచు న్నాఁడు, పిచ్చివాఁడు" అని తలఁచి పిచ్చివాండ్ర వైద్యశాలలోఁ జికి త్సం జేయింప నాతని బలాత్కారముగాఁ బ్రవేశపెట్టిరి. నీరోగియని వై ద్యులు పరీక్షించి వదలిరి. పిమ్మట రాజద్రోహి యని రాజపురుషులు

కారాగారమున నునిచి, బాధించిరి. చెఱసాల యందును నాతఁడు పాచ్ఛాకొమరిత నుద్వాహామగుదు ననుమాటను వదలలేదు. భక్తి సంకీర్తనములను మానలేదు. వేళతప్పకుండఁగ నమాజులు చేయుచుండెను. ఖురానును జదువుచుండెను. ఇట్లుండ నొకప్పుడు పాచ్ఛా కారాగారమును బరీక్షింప వచ్చెను. అపుడు కారాగారరక్షకులు పకీరుతో నీవు ప్రభువు వచ్చిన సమయమున మిన్నకుండువేని నిన్ను రేపె చెఱనుండి విడిచెదమని యాసఁ గొలిపిరి. పకీరేమియు ననక మిన్నకుండెను. శృంఖలాబద్ధుఁడగుపకీరు నవాబుకంటఁ బడఁగనే, "ఓపాచ్ఛాగారూ! మీకుమారిని నేను వివాహమయ్యెద" ననెను. "అదేమి"యని నివ్వెఱపడి పాచ్ఛా చెఱసాలోద్యోగులం బ్రశ్నింప, వా 'రీతఁడు రాజద్రోహి' యని చెప్పఁ, గ్రూరముగా నిర్బంధింపుఁ" డని మహమ్మదీయప్రభువు చెప్పి వెడలి పోయెను.

భక్తునకు నిర్బంధము లెక్కుడయ్యెను. ఆతని పట్టుదలయు నెక్కువయ్యెను. రాత్రులాతని సంకీర్తనములచేఁ గారాగారము మాఱుమ్రోయుచుండెను. కారాగారస్థుల మనంబులు భక్తిచే ద్రవీభూతంబు లగుచుండెను. దుర్మార్గులు సన్మార్గులును, భగవద్భక్తులు నగుచుండిరి. ఆతని సద్బోధనములను వినవిన, కారాగారవాసులు చేయునేరములు తగ్గుచుండెను. చెఱనుండి విడుదలఁ గన్నవారు, కారనుండి సంపాదించిన సద్బోధామృతరసమును దేశమున వెదచల్లుటచే దేశములోఁగూడ నేరములు తగ్గెను. అందువల్ల కారాగారమునకు వచ్చువారు తగ్గిరి. దండనాధికారులకును గారాగారపాలకులకుఁ బని తగ్గెను. ఈయంశము క్రమముగా బాచ్ఛాకుఁ దెలిసి భక్తుఁడగు పకీరును సమ్ముఖమునకు రప్పించి గౌరవించి, "నీకేమి కావలయు" ననెను. అన పకీరు, నీకూఁతును నా కిచ్చి పెండ్లిచేయవలయు" ననెను. పాచ్ఛా కిపుడు కోపముపోయి నవ్వు వచ్చెను. అపుడు వారిట్లు సంభాషించిరి:—

పాచ్ఛా:—(నవ్వుచు) నాకొమరితను బెండ్లియాడుటకుఁ దగిన ఓలిని (పెండ్లికొడుకు కన్యాపిత కిచ్చుశుల్కము) నాకీయఁగలవా?

ఫకీరు:—ఈయఁగలను. ఏమి కావలయును? ఎంతకావలయును?

పాచ్ఛా:—పెద్ద నిమ్మకాయలవంటి నూఱు మంచిముత్యములు కావలెను. (దుర్లభమగు నిట్టివానిఁ దేలేఁడని పాచ్ఛా తలంపు.)

ఫకీరు:—ఈయఁగలను.

పాచ్ఛా:—ఎంతకాలమునకుఁ దేఁగలవు?

ఫకీరు:—కాలపుమితిని జెప్పలేను గాని తెచ్చుటమాత్రము నిశ్చయము. నేను తెచ్చునపుడు మార్గమునందు మీరాజపురుషు లేయాటంకమును జేయరాదు.

అన నల్లె యని ఫకీరును పాచ్ఛా వదలెను.

ఫకీ రెక్కడ, నూఱు మంచిముత్యములు—అందును నిమ్మపండ్లంతయుఱవు కలవి తెచ్చుట యెక్కడ? కాని ఫకీరు రత్నశాస్త్రముఁ జదివి దక్షిణసముద్రాన ముత్యము లుండునని తెలిసికొని, పిమ్మట నా రత్నాకరవేలను జేరెను. అట నిసుకతో గట్టు వేసి తనకు శక్యమగునంత చెఱువు నేర్పఱచెను. తన యుపకౌపీనమును నడుమునకుఁ జుట్టి ఖంజరి నొగనిఁ బదిలపఱచి, కొబ్బరిచిప్పతో సముద్రపునీటిని దాను నిర్మించిన తటాకములోనికిఁ దోడనారంభింపఁగా, యాతాయాతజను లీవింతను జూచి, 'ఇదే' మనిరి. "సముద్రపునీరిని దోడి సముద్రములోని మంచిముత్యములం గొనుట" కని ఫకీరు చెప్పెను. జనులు నవ్విరి. వెఱ్ఱివాఁడనిరి. వెఱ్ఱి వేయివిధా లనిరి. ఈతని యాయాసముం జూచి ఫకీరు వ్యర్థముగా బాధ నొందుచున్నాఁ డని కొందఱు విచారించిరి. ముత్యములు దొరకకపోయినను, చెఱువులోని నీ రింకిన పిమ్మట నుప్పయిన లభించునని మఱికొంద ఱనిరి. రాత్రింబవళ్ళిటులు కష్టపడి ఫకీరు పని చేయుచుం

డఁగ వెక్కిరింతకు వేడుకకు మఱికొందఱుగూడ నతనిం గూడి చిప్పల తోఁ గుండలతో నీటిని దెచ్చి తటాకములోఁ బోయసాగిరి. కొన్నిదినా లకుఁ దటాకము నీరితో నిండెను. కాని సముద్రములో నొక్కచుక్క యైనఁ దగ్గినట్టులు లేదు. పైపెచ్చు నీరు చెఱువులో హెచ్చయి చెఱువు గట్టు తెగి నీరంతయు సముద్రమునకే చేరెను. అందఱును గొల్లున నవ్విరి. సన్యాసి మాత్రము నిరాశ నొందలేదు. మరల మునుపటికంటెఁ బెద్ద గట్టును కొన్ని దినములలో వేసి మరల నీటిని దోడ నారంభించెను. అతని ప్రయత్నమున కాటంకములఁ గలుగఁజేయుచు జనులు పిచ్చివాఁడవనిరి. మీరే పిచ్చివారని తనపనిని మానక ఫకీరు నీటిని దోఁడుచుండెను. ఎంతకష్టపడుచుండినను నియమితకాలములలో భగవద్భజనమును మానకుండెను. మాధుకరాన్నమున క్షున్నివారణము చేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడవఁగా సముద్రుఁ డీతని పట్టుదలను, 'అల్లా' యందుఁ గల నమ్మకముతోఁ గూడినభక్తిని జూచి చూచి యాశ్చర్యపడి, నల్లనిదేహముగల వృద్ధబ్రాహ్మణ వేషమునఁ ఫకీరునకుఁ బొడసూపి యాతని బలుకరించి యిట్లు ప్రశ్నించెను.

సముద్రుఁడు:—బాబా! నీ వెందులకు సముద్రపునీటిని దోఁడుచుంటివి?

ఫకీరు:—సముద్రములోని పెద్దముత్యములం గొనుటకు.

సముద్రుఁడు:—సముద్రములోని నీటిని దోఁడఁగలవా?

ఫకీరు:—తోఁడఁగలను.

సముద్రుఁడు:—ఎంతకాలమునకు?

ఫకీరు:—ఎంతకాలమునకో చెప్పలేను.

సముద్రుఁడు:—నీకాముత్యము లెందులకు?

ఫకీరు:—పాదుషాకూఁతుం బెండ్లియాడుటకు.

సముద్రుఁడు:—సర్వసంగ పరిత్యాగి వగు నీ కింకను పెండ్లి కావలయునా?

పకీరు:—(నవ్వుచు) నాకు వివాహ మవసరము లేదు. కాని భగవంతుని నమ్మి, మంచికార్యముకై పట్టుదల గలిగి, పరాపకారముం దలపెట్టక పరోపకారమునకై మెలఁగిన స్వల్పజనుఁడైన నత్యంతఘనకార్యముం జేయఁగలఁ డను శాస్త్రనిదర్శనమును లోకమునకుఁ జూపుటకే యిట్టిప్రయత్నముం జేయుచుంటిని.

అంత సముద్రుఁ డాతని యుద్యమమునకు మెచ్చి, "నేనే సముద్రుఁడను; నీయుద్యమమునకు మెచ్చితిని. నీకుఁ గావలసిన ముత్యముల కంటె నధికమగు ముత్యములనే యిచ్చెద" నని యొక కెరటమువలన పకీరు కోరినవానికంటె దశగుణములుగా ముత్యములను బకీరుకాళ్లకడ కెరటముతోఁ బడునట్లు చేసెను.

మఱునాఁ డావార్త గ్రామములోఁ దెలిసెను. ప్రజలాశ్చర్యము నొందిరి. పకీరు మహానుభావుఁడని యాతనికి బ్రహ్మరథమును బట్టిరి. బండి చేసి యాతనిముత్యములను బస్తాలతోఁ గట్టి పదిలపఱచి రాజధానీపురమునకుఁ బంపిరి. ఖంజరి వాయించుకొనుచుఁ దన్మయుఁడై పకీరు భగవత్సంకీర్తనములఁ బాడుకొనుచుఁ గొలఁదిదినములకే గోలకొండకుఁ జేరి, వెంటనే, ఆటంకములేని యనుజ్ఞఁ దొలుతనే పొందుటచేఁ బాదుషామందిరమును బ్రవేశించి, పాదుషాకు బస్తాలతో నిండిన నిమ్మకాయల యుల్లిపును దించిన యాణిముత్తెములను నెదుటఁ దిమ్మరించెను. వానిఁ జూచి, ప్రభువాశ్చర్యానందములతో నోడలు తెలియక కొంతవడి రిచ్చవడి "యెట్లీముత్తెములం దెచ్చితి" వనఁ, బకీరు, నీకది యవసరము లేదు; కేవ లీకూఁతును నాకుఁ బెండ్లి సేతువా .లేదా?" యని నిర్బంధింపఁగాఁ బాదుషా మాటఁ దప్పిన, మహాత్ముఁ డగునీభక్తున కపకా

రము చేసిన దోషముచేఁ దనసామ్రాజ్యమునకుఁ దనకు నేమిముప్పు కలుగునో యని భయభక్తులతో మఱునాఁడే పెండ్లిచేయుదు ననిచెప్పి, యట్టి వివాహమునకుఁ దగుప్రయత్నములఁ జేయించి, తగువారి కాహ్వానములఁ బంపెను. నలుదిశల కీవార్త తెలిసి పాదుషా పకీరుతో సంబంధము చేయుట యత్యాశ్చర్యకర మని కొందఱును, ఇది కల్లయని మఱి కొందఱును, పాదుషాకు మతి పోయిన దని కొందఱు ననిరి. మఱికొందఱు పకీరు మహిమచేఁ బాదుషాను మించినవాఁడె యనిరి.

ఎట్లయిననేమి ? లగ్నం బెల్లి; వివాహముంగదిసె. పకీరు తనమహిమచే నెట్టియలంకారమును ధరించునో చూతుము గాక ! యని మహాజనులు కల్యాణమంటపముచుట్టు మూఁగిరి. పకీరు పాచ్ఛాను కల్యాణమంటపముకడకుఁ దాఁ దెచ్చిన జోలియగు ముత్యములం జేర్పుమని కోరెను. చూపఱులకుఁ గన్నులు మిఱుమిట్లుకొలుపులాగున ముత్యములాకల్యాణమంటపమునఁ బోగుపోయఁబడెను. మీర లంకరించుకొని రావలయు నని పాదుషా పకీరును గోరెను. పకీరు తన కేర్పఱుపఁ బడిన గదిం జేరి కల్యాణమూర్తియగు భగవంతుని బ్రార్థించి ప్రార్థించి, పకీరెంతగ నలంకరించుకొనునో చూడ వేడుకపడు చుండిన కల్యాణమంటపములోనివారి కాశ్చర్యము గలుగునట్లు గోచిని ధరించి, మఱియొక కౌపీనమును పైని వేసికొని, ఖంజరిని, కొబ్బరిచిప్పను చేతఁబట్టి, పెండ్లియరుఁగుపైకి వేంచేసెను. పాదుషా ఈనయల్లు డిట్టివాఁడే యని మొగమును చిన్నచేసికొనెను. అవుడు పకీరు ప్రజలను ప్రభువును నుద్దేశించి యిట్లుపన్యసించెను:—

"మిత్రులారా! నాకుఁ బెండ్లితో నిమిత్తము లేదు. ఎంతటియల్పుఁడుగా నుండినను భగవంతుని నమ్మి సేవింపుచు, నహింసా సత్యముల నవలంబించి పరోపకారబుద్ధిఁ గలిగి పట్టుదలతోఁ బనిజేసిన నెంతమ

హత్తరకార్యమునైన సాధింపవచ్చునను శాస్త్రములలోని వాక్యములను సోదాహరణముగాఁ జూపుటకే నేనీ పనిని జేసితిని. పాదుషాకూఁతు రఁగునుత్తమవనితను దగినసమర్థుఁడగువాని కిచ్చి పెండ్లి సేయవేఁడెదను. నేఁ దెచ్చిన ముత్యములను విక్రయించి యాద్రవ్యమును "బధిర పంగ్వంధ భిక్షుక జటి పరివ్రాజ కాద్యనాథులకును, సత్యజ్ఞానోపదేశకులకును, బాచ్ఛా యుపయోగింపఁ గోరెదను" అని భగవన్నామసంకీర్తనముఁ జేసికొనుచు నెటకో పకీరు వెడలిపోయెను. పాదుషా పకీరుయొక్క యుపదేశముల ననుసరించి సదనుష్ఠానతత్పరుఁడై పకీరు చెప్పినట్లు చేసి వన్నె కెక్కెను. ఇట్టి పకీరులే సర్వజనవంద్యులు, మహాయోగులు నగుదురుగదా!

---

# ఆంధ్రగాయకుఁడు

[illegible]

(త్యాగరాజయోగి)

ఆంధ్రులు వైదికకాలమునుండి నేఁటివఱకును గానకళా ప్రవీణులు, తత్కళాప్రియులు నై యున్నారు. ఆసంగీతమును దమ మతకర్మములయందును వినియోగించుటయే యిందులకు నిదర్శనము. అందుఁ బెక్కండ్రు మహామహులు దేశాభిమానము జొప్పించు గీతికలచేఁ దమ ప్రౌఢిమను వెల్లడించి యున్నారు. ఇందులకు మనయాంధ్రజాతిలోని బ్రాహ్మణక్షత్రియవైశ్య శూద్రసంఘములలో నూటికెనుబదిమందికి శుభాశుభకర్మముల విధులను నిర్ణయించి యాంధ్రజాతి మహర్షి యనిపించుకొనిన 'ఆపస్తంబముని' యొక్క వాక్యములే నిదర్శనములు. (ఆపస్తంబుఁడు సాల్వదేశమును యమునానదిని యౌగంధరి మహారాజును గానముచేయువలయునను. నంశము వేఱొకస్థలమునఁ జర్చింపఁబడెను.)

మఱియు నాంధ్రులు తమ సంగీతసామగ్రియందుఁ గల ప్రీతిని గానసమయములఁ జూపఁబడు వివిధ రసభావములను జిత్రకళలోఁగూడ నిముడ్చి చూపియున్నారు.*

ఆంధ్రులసంగీతప్రౌఢిమ ప్రాచీనకాలమున యమునానదీ ప్రాంత దేశాదులనుండి తుదకు కావేరీనదీపరిసరమువఱకుఁ బ్రాకిన ట్లాపస్తంబ మహర్షి యొక్కయు నిపుడు వ్రాయఁబడు త్యాగరాజయోగియొక్కయుఁ జరితములే నిదర్శనములు.

త్యాగరాజు క్రైస్తవశకము పదునెనిమిది పందొమ్మిది శతాబ్దముల యొక్క (క్రీ. శ. 1789–1847 సం॥రముల) నడిమికాలమున జన్మించెనఁట* అతఁడు పవిత్రమైన కావేరీనదీతీరమునఁగల 'తిరువాలూరు' గ్రామమున, కాకర్ల వంశమున, 'శాంతాదేవి'. రామబ్రహ్మములను పుణ్యదంపతుల కుద్భవించియున్నాఁడు. వారిది 'ములికినాఁటిశాఖ.' ఈ తనియగ్రజుఁడు పంచనదబ్రహ్మము. త్యాగరాజుయొక్క చిన్నతనముననే యాతనితండ్రి తనపుత్రులకు విద్యను గఱపించు నిమిత్తము సంగీతసాహిత్యవిద్యలకుఁ బుట్టినిల్లగు 'తిరువైయారు' గ్రామమునందు 'యాయావరపు' వృత్తితోఁ గుటుంబపోషణ మొనర్చుకొనుచు నివసించెను.

త్యాగరాజును రామబ్రహ్మము తొలుత సాహిత్య విద్యాభ్యా

---

* ఆంధ్రుల శిల్పకళాచమత్కృతి 'ఎల్లోరా, అజంతా, గుహలలోను, 'అమరావతి, నాగార్జునకొండ' మొదలగుచోటులఁగల స్తూపములలోను వెల్లడియగుచున్నది. శైసలములలోఁ దామత్యంతము ప్రేమించు వివిదములగు 'వీణావేణు మృదంగాదుల చిత్రములయొక్కయు గాయకులయొక్క భావరూపములు సత్యద్భుతముగఁ జిత్రింపఁబడుటయె యిందులకుఁ దార్కాణములు.

* మైసూరు మహారాజావారియొక్క జగన్మోహనబంగళాలోను, బిడారంకృష్ణప్పగారియొక్క రామమందిరమందును గల త్యాగరాజ పటములక్రింద నీయంకెను వ్రాయఁబడెను.

సముకోఁఱకు కావ్యనాటకాలంకారములఁ జదువ నాపురిని గల సంస్కృతపాఠశాలలోఁ బ్రవేశమును గలిగించెను. కాని త్యాగరాజునకుఁ గల సంగీతవిద్యాసక్తి యందులకు విఘ్నము నాపాదించెను. త్యాగరాజు తాను బోవు సంస్కృతపాఠశాలకు సమీపమందుండిన సంగీతపాఠశాలలోఁ జెప్పు గీతరాగాదులపై దృష్టినుంచి వానినే 'ఏకలవ్యు' ని విధమున నభ్యసించుచుండెను.

ఈయంశమును దండ్రి కనిపెట్టి యీబాలుని సంగీతప్రియత్వమును మాన్ప నెంతయు నిర్బంధించుచుండ, నాతనితల్లియగు శాంతాదేవి తండ్రిని నివారించుచుండెడిది. కారణ మేమన, నాతని జనని సంగీతవిద్యాప్రియ యగుటచే "పురందర దాసు"యొక్క కృతుల నామె బాగుగా గానము చేయుచుఁ జిన్నబిడ్డఁడగు త్యాగరాజునకు నేర్పుటయే! అందువలన దంపతులకు వివాదమును గలిగెడిది. తనకుమారుఁడు సాహిత్యవిద్యావంతుఁడు కావలెనని తండ్రియు, సంగీతవిద్యావంతుఁడు కావలె నని తల్లియుఁ బట్టుపట్టుచుండిరి. కాని మనహిందువులలోఁ దండ్రియొక్క మాటయే తొలుత జెల్లునుగదా! అందువలనఁ దండ్రియగు రామబ్రహ్మముమాట మొదట చెల్లినను త్యాగరాజుయొక్క ప్రవృత్తి యంతయును సంగీతవిద్యయందే యుండుటచే శాంతాదేవియొక్కమాటయే తుదకు నెగ్గెను. అందువలన త్యాగరాజును జనకుఁడు సంగీతపాఠశాలయందే పండితుఁడగు శొంఠి వేంకటరమణయ్య యను వైణికునకు శిష్యునిగా నొనర్చెను. అం దాతఁడు దినదినాభివృద్ధితో సంగీతకళ నభ్యసించుచుఁ దత్పూర్వము సంస్కృతపాఠశాలలోఁ జదివిన రామాయణము నందలి కథలతోఁ దనసంగీతకళను జేర్చుచు గీతికలను రచించుచుండెను. కొన్నినాళ్ళ కాతఁడు సంగీతవిద్యలోఁ బ్రౌఢుఁడై పాఠశాలను విడిచెను.

క్రమముగా నాతనిగానకళ యేకోత్తరాభివృద్ధి నొందుటయేగాక రామకథాప్రియత్వముచే నంతయు రామమయముగ మార్పుఁదొడంగెను. ఆతని కేమూలఁ జూచినను రాముఁడె కాన్పించెను. భక్తియం దీతని కీడువచ్చునాంధ్రులు (1) భద్రాద్రిరామదాసు (2) సిద్ధయోగీశ్వరుఁడు* (కర్నూలు).

త్యాగరాజు వృత్తికూడ నాదబ్రహ్మము నుపదేశించి యానందించుటయే! అందులకు వృథాగా కాలమును వ్యయపఱచక నియమితసమయములలోనే దానిని వెచ్చించుచుండెను. తొలుత నాతనిరీతి నెఱుంగక కొందఱు హేళన మొనర్చిరిగాని తుద కాతనిని గౌరవించి యాతఁడు చేయు సభక్త్యున్మేషగానములలోఁ బాల్గొనిరి.

త్యాగరాజు స్వరూపమున స్థూలకాయుఁడు గాక పలుచని పొడవైనశరీరము కలవాఁడు. వృత్తియందుఁగూడ మనస్తృప్తిని గలిగించెడి భిక్షావృత్తి. ఆభిక్షాటనమైనను, కుటుంబపోషణమునకుఁ దగినటుల వారమున కొక్కసారియే యగుచుండెను. మొదట నీతనివృత్తిఁ బరీక్షింప నెందఱో యత్నించిరి. కాని యాతని సత్ప్రవర్తనమును జూడఁజూడ నాతఁడు శుద్ధశ్రోత్రియుఁడై యుండినట్లు కాన్పింప నందఱును మిక్కిలి గౌరవించుచుండిరి.

మఱియు వాడుకయందున్న కొన్ని గాథలను బట్టి చూడఁగా బాల్యమందే వీరికొకమహానుభావుఁడు రామతారకమంత్రము నుపదేశించినట్లును, మఱొకప్పుడు నారదమునీంద్రుఁడే యతివేషమున వీరికిఁ బ్ర

* ఈతఁడు పదునెనిమిదవశతాబ్దమునఁ గర్నూలునందలి ‘‘నందికొట్కూరు’’ గ్రామములో నుండువాఁడు. ఈతఁడు ‘‘బాజిత్ ఖాను’’ అను కర్నూలునబాబుయొక్క సరదారు పేరఁ గృతినిచ్చి ద్విపదలో మూఁడాశ్వాసములుగల ‘‘సిద్ధయోగీశ్వరవిలాసము’’ అను గ్రంథమును రచించెను. తనభజనములచే ‘సర్వం శివమయం జగత్’ అనిపించిన శివభక్తుఁడు.

త్యక్షమై 'స్వరార్ణవ' మను సంగీతగ్రంథ మిచ్చినట్లును దెలియుచున్నది. స్వరార్ణవమునుండియే యనేక సంగీతవిద్యావిషయములు త్యాగయ్యగారు తెలిసికొన్నారఁట. ఆగ్రంథరాజ మిప్పుడు మృగ్యము.

సంగీతవిద్య పూర్తియైనపిమ్మట వీరి తల్లిదండ్రులు స్వర్గస్థులైరి. త్యాగయ్యగారి కొకచిన్న యిల్లును, శ్రీరాముని బంగారు ప్రతిమయు మాత్రమే పైతృకధనములు. చిన్నతనమునుండియు నకారణముగ విరోధించుచుండిన వీరియన్నయగు పంచనదబ్రహ్మము, త్యాగయ్యమీఁద లేనిపోనినేరములను మోపుచు వీరి మనసును జీకాకు పరచుచుండెను. ఒకనాఁ డీర్ష్యాళుఁడై త్యాగయ్య పరమపవిత్రముగా నెంచుకొని భక్తితోఁ బూజించుచున్న శ్రీరామప్రతిమను క్రౌర్యముతో నదిలోఁ బాఱవైచెను. అప్పు డాభక్తునకుఁ గలిగిన దుఃఖ మింతింతయని చెప్ప నలవికాదు. శ్రీరామప్రతిమ దొరకువఱకు నన్నపానీయముల ముట్టనని ప్రతినపట్టి, యాతఁ డాదుఃఖములోనుండియే యనేక కీర్తనములను రచించెను. తుదకు శ్రీరాముఁడు స్వప్నమున సాక్షాత్కరించి తానున్నచోటును దెలిపి యదృశ్యుఁ డయ్యెనఁట. వెంటనే యాస్థలమునకుఁ బోయి విగ్రహమును దీసికొని యూరేగుచు నుప్పొంగిన యుత్సాహముతో త్యాగరాజయోగి "కనుగొంటినే శ్రీరాముని నేఁడు" మొదలగు కృతులఁ బాడుచు నింటికి వచ్చెనఁట. వీరి భక్తివంటి నిశ్చలభక్తి యెందఱకు లభించును?

త్యాగయ్యగారు తమ యద్భుత గానామృతరసము నూరి వారల కిచ్చి, వారివలనఁ బ్రతిఫలమును బడయుచుండిరే గాని కేవలము పొట్టపోసికొనుటకై భిక్షుకవృత్తివలన జీవింపలేదు. వారమునకొక్కనాఁడు, చేతఁ దంబురా ధరించి తాము రచించిన కీర్తనములను భక్త్యావేశమునఁ గంఠమెత్తి వీధులయందుఁ బాడుచుఁ బోవుచుండఁ బౌరులు పులకాంకి

తులై యాభక్తునకుఁ దమశక్త్యనుసారము భిక్షాద్రవ్యము నొసఁగుచుండిరి.

నిర్ధనుఁడై యుండియు మహారాజాశ్రయమును సైతము, దృణప్రాయముగ నీతఁడు చూచెను. ఒకప్పుడు తిరువాంకూరు మహారాజుగారు వీరి ప్రసిద్ధిని విని తమయాస్థానమునకుఁ గొనిరా నొకసంగీతవిద్వాంసుని వీరికడకు బంపెను. కాని త్యాగరాజాయాహ్వానముఁ దిరస్కరింప, తిరువాన్‌కూరు విద్వాంసుఁడు విఫలమనోరథుఁడై వెడలిపోవలసి వచ్చెనఁట! త్యాగయ్య బమ్మెర పోతనామాత్యునివలె నిరపేక్షకుఁడు. నిరాడంబరజీవనము—నిరంతరభగవద్భక్తి—ఇవియే త్యాగరాజునకు పోతరాజునకు జీవితపరమావధులు. ఇట్టివా రేరికి పూజ్యులు కారు ?

ఇంతటి మహాభక్తుఁడయ్యు నీతనికి ముంగోప మధికముగా నుండెడిదఁట. అందువలననే వీరికడ సంగీతవిద్య నభ్యసించెడి శిష్యు లప్పుడప్పుడు కఠినమగు శిక్షలకుఁ బాత్రులగుచుండిరి. సులభకోపి యగు త్యాగరాజు తన శిష్యులలో నొకఁ డొకనాఁడు వేశ్యలుపాడు 'జావళీలను' బాడగా విని కోపోద్రిక్తుఁడై యాతని నింటనుండి తరిమివైచెనఁట. అప్పుడు భార్యకును త్యాగయ్యకును శిష్యు నింటినుండి తఱిమివైచుటను గూర్చి వాగ్వాదము కూడ జరిగెనందురు. చివరకుఁ ద్యాగయ్య తన తొందరకుఁ బశ్చాత్తప్తుఁడై "శాంతము లేక సౌఖ్యము లేదు" అను కీర్తనను రచించిరఁట! నాఁటినుండియు శిష్యులను ప్రేమతోఁ జూచుచు శిక్షింపకుండెనఁట.

త్యాగరాజయోగి జీవితమున మానవాతీతములగు శక్తులును గలవని చెప్పుదురు. త్యాగయ్య కారణాంతరములచే స్వగ్రామమును విడిచి యొకప్పుడు శిష్యులతోఁ గూడ సంచారముఁ జేయవలసివచ్చెను. ఆసంచారములోనే తిరుపతి కేఁగెను. అతఁడు దేవళమున కేఁగుకాలమున

నచట స్వామిదర్శనము కాకుండగ నర్చకులు తెరవేసియుండిరి. అప్పుడు “తెరతీయరాద ! తిరుపతి వేంకటరమణ ! లోని మత్సర మను తెర” అను కీర్తనను పాడఁగా, తెర జాఱిపడి వేంకటేశ్వరుఁడు భక్తునకుఁ బ్రత్యక్ష మయ్యెనఁట !

తిరుపతినుండి, కోవ్వూరను గ్రామమునకు వచ్చి యచ్చట నున్న సుందరేశ్వరుని దర్శించెను. ఆగ్రామమునందు ధార్మికుఁడగు ‘సుందరేశ మొదల్యా’ రను నతఁడు త్యాగరాజును భక్త్యాదరములతోఁ దన గృహమునకుఁ గొంపోయి యతిథి సత్కారములను గావించెను. త్యాగయ్య గారిభక్తికి మెచ్చి, మొదల్యారు త్యాగయ్యగారి శిష్యులకు మాత్రము చెప్పి వారెక్కిన పల్లకిలో వేయి రూపాయిలసంచి నుంచెను. ఈసంగతి చెప్పి చేసినచోఁ ద్యాగరాజుగా రెంతమాత్రము సమ్మతింపరు. అందుచే రహస్యముగా సత్కరింపవలసివచ్చెను. మరునాఁ డుదయముననే లేచి, త్యాగరాజుగారు శిష్యులు వెంట రాఁ బల్లకిలోఁ బ్రయాణ మొనర్చిరి. కొంతదూర మేఁగినవెనుక పల్లకిమీఁద ఱాళ్లు పడుట కారంభ మయ్యెను. అందులకు బోయవాండ్రును శిష్యులును దొంగ లని భయపడఁ జొచ్చిరి. త్యాగయ్యగారు “నాయొద్ద కాసైనను లేదే. భయ మేల?” యని పాడుచు వారికి ధైర్యమును జెప్పిరి. అందులకు శిష్యులు “అయ్యా! తమకుఁ దెలియకుండ మొదలియారుగారు వేయిరూపాయల సంచిని బల్లకిలోఁ బెట్టియున్నా” రనిరి.

ఇంతలో దొంగలు దగ్గఱకు రాఁగా నామూటను ద్యాగయ్యగారు వారిముందు విసరివైచి “ఇవిగో! వేయి రూప్యములు. తీసికొనుఁడు” అని యానతిచ్చిరి. అప్పుడు దొంగల నాయకుఁడు వణకుచు నిట్లనెను.

దొం:—అయ్యా! ఆధన మంతయుఁ దమదే. అదియును గాక మేమందఱమును మీ సేవకులమే! మమ్మెటుల ననుగ్రహింపుఁడు.

త్యా:—అటులైనచో మామీఁద ఱాళ్లేల విసరితిరి ?

దొం:—స్వామీ! మేము దొంగలమే. మేము చిన్ననాఁటినుండి యు నీదుర్వృత్తినే యవలంబించి జీవించుచుంటిమి. మీయొద్దనున్న ద్రవ్యము నపహరించుటకే మీమీఁద మును ఱాళ్ళను రువ్వితిమి. అందు నేనొక పెద్దఱాతిని దీసి మీమీఁద విసరితిని కాని, యది తిరిగి వచ్చి నాతలకే తగిలి తలను గాయపఱచెను. దానికి నే నత్యాశ్చర్యముతో నేమికారణమో యనిచూడ సిద్ధులుయోధులు ధనుర్ధరులై మామీఁద బాణప్రయోగము గావింపుచుండిరి. వా రెవరో, తెలిసికొనఁగా, మీశిష్యులమనియు రామలక్ష్మణుల మనియుఁ జెప్పి వా రదృశ్యులైరి: అట్టి వీరాధివీరులగు దైవతములకే మీరు గురువులని విని సిగ్గుపడితిమి. మహానుభావా! ఇంతటినుండి మేము చోరవృత్తిని విసర్జించుచున్నాము. క్షమింపుఁ డనిరి.

త్యా:—నిజముగా నీవు ధన్యుఁడవు. నాకుఁగూడ లభ్యముకాని శ్రీరామలక్ష్మణుల దర్శనభాగ్యము నీకు లభించిన దనెను.

నాఁటినుండియు నాతస్కరు లానంద పరవశులై త్యాగరాజుగారికి శిష్యులై భక్తులై సేవకులైరి.

ఆదినములలోనే త్యాగరాజుగారు కొన్ని క్షేత్రములను దర్శించు కుతూహలముచేఁ బ్రయాణము సాగించుచుండిరి. ఒక్కెడ నుదయముననే రోదనధ్వని త్యాగయ్యగారికి వినఁబడఁగా వెంటనే పల్లకి నిలిపి యాదుఃఖమునకుఁ గారణ మారసి రమ్మని యచ్చోటునకు దొంగలనాయకుని బంపిరి.

ఆతఁ డారసి వచ్చి, యొక్క బ్రాహ్మణుఁ డకాలమరణము నొందుటచే నాతనిభార్య రోదనము చేయుచున్నదని తెలిపెను. త్యాగయ్యగారు వెంటనే యాప్రదేశమున కేఁగి "శ్రీరామపాదమా—నీకృపజాలు

నీ—జారయహల్యను బ్రోచితివి—ఆరీతి ధన్యుసేయవే' అని పాడుడు దమయమృతహస్తమున నామృత శరీర మంతయుఁ దడవ నావిప్రుఁడు లేచి కూర్చుండెనఁట! లోకమున నిట్టి కథలనేకములు ప్రచారమునం దున్నవి. భక్తుల జీవితము లిట్టిమానవాతీత మగుశక్తులలో నిండి యుండును గదా!

త్యాగయ్యగా రనేకభక్తి, జ్ఞానప్రబోధకములును, సమయానుకూలములును నగుకీర్తనలను రచించుటయేగాక "భక్తవిజయ" (ప్రహ్లాదచరిత్రము) మను యక్షగానమ్మును, "నౌకాచరిత్ర" మను (శ్రీకృష్ణపరమాత్మ గోపికాంగనలతోఁ గూడి యమునానదిలో విహరించుట) శృంగారప్రబంధమును రచించి యాంధ్రకవితాప్రపంచమునఁ బ్రదీపించుస్థానమునుగూడ నాక్రమించినారు. తేనె లొలుకు చిన్నచిన్న భావగాంభీర్యయుక్తములగు తెలుఁగు నుడులతో నన్వయకాఠిన్య మిసుమంతైన లేకుండుకీర్తనలను రచించుటయందు వీరికి వీరె సాటి. వీరికవితామాధుర్యమునకు ముగ్ధులై దక్షిణభారతమునందలి గాయకగాయనీమణు లెల్లరును వీరికీర్తనలఁ బాడుచుందురు.

త్యాగరాజయోగికి తుదిదశలో భార్యావియోగము కలిగినది. అప్పుడు మోక్షార్థియై సన్న్యాసాశ్రమమును స్వీకరించి ముక్తుఁ డయ్యెను. త్యాగరాజజీవిత మంతయు నఱిగి తఱిగి నశించిపోవువఱకును దిగంతములు మారుమ్రోగునట్లు తొంబదియాఱుకోట్ల శ్రీరామనామస్మరణ మొనర్చి తమభౌతికశరీరమును వీడి భగవత్సాన్నిధ్యమునకుఁ జేరుకొనెనఁట*

సంగీతకళాకోవిదుఁడు, సరసకవితాసామ్రాజ్యపట్టభద్రుఁడు మహాభక్తుఁడు నైన యీయాంధ్రసత్తముఁడు సమాధిఁ బొందిన ప్రదేశమున దివ్యమగు మందిరమును గట్టించి ప్రతివత్సరము వారి యారాధన

*పరాభవ సం॥ర పుష్య బహుళ పంచమినాఁడు యోగి సిద్ధి నొందెనఁట!

మతిపై భవముగా జరుగుట కేర్పాటొనర్చిన విద్యాసుందరి బెంగళూరి నాగరత్నముయొక్క యౌదార్యమత్యంతము పొగడఁదగియున్నది. నేఁటికిని త్యాగరాజయోగి సమాధి కావింపఁబడిన ప్రదేశవిభవ మేకోత్తర ముగ వృద్ధిఁ బొందుచు నారాధనాకాలమున దక్షిణదేశపు ప్రముఖులగు గాయకోత్తముల నాకర్షించుచున్నది.

మహాభక్తుఁ డగుటవలననే యీతఁడు త్యాగరాజయోగి యనఁ బడెను.

---

# *ప్రాచీనాంధ్రవర్తకుఁడు



ఆంధ్రమాత 'వసుంధర, రత్నగర్భ' యను సార్థకనామములు కలదగుటచే సువర్ణాదిలోహములకును, 'వజ్ర, నీల, పుష్య రాగాది బహువిధరత్నసమూహములకును, గోదావర్యాదిజీవ స్రవంతులు కలదగుటచే సమస్తఫల ధాన్యాదులకును, సువిశాలారణ్య యగుటచే వివిధ వన్యపదార్థములకును, శిల్పకళానిపుణులు కల దగుటచేఁ జిత్రవస్తువులకును, వేదవేదాంగాది సమస్త విద్యావేత్తలు కల దగుటచేఁ సదుపదేశములకును, నతిప్రాచీన కాలమునుండియుఁ బ్రసిద్ధి నొందియున్నది. అందువలననే ప్రాచీన కాలమున నీదేశమునకు విదేశపువర్తకులు స్థలజలమార్గములచే వచ్చి రత్న కుప్య కుప్యాదులచేతను చీనిచీనాంబరాది చిత్రవస్తువులచేతను, బదార్థవినిమయములఁ జేసికొనుచు వర్తక మొనర్చుచుండిరి. విద్యాభిలాషు లీదేశమునకు వచ్చి గురుశుశ్రూషాదికముచే విద్యాసంపా

---

*ఈకథ 'పాలవేకరి కదిరీపతి' కవికృత శుకసప్తతి యనుగ్రంథములోని మొదటి కథ నాధారముగాఁగొని వ్రాయఁబడెను.

దన మొనర్చుకొనుచుండిరి. సద్విద్యోపదేశమునకై మఱికొన్ని విద్యాపే
రిషత్తులవారు, క్షితిభువులు, నీయాంధ్రావనిలోని 'దిఙ్నాగాచార్య, కు
మారిలభట్టాచార్యాది' మహాపండితులను దమదేశములకు రప్పించి స
న్మానించి వారినుండి విద్యాజ్ఞానలాభముల నొందుచుండిరి. అట్లే యాం
ధ్రావనీ పుత్రులును, భరతఖండస్థాన్యప్రదేశములకును, 'యవన, పార
శీక, చీనా, యవద్వీపా' దులకును, నేఁగి బహువిధరత్న లోహచిత్ర
విచిత్రవస్తుతతిని, కాశీ, నవద్వీపా' దులకుఁ బోయి తర్కవ్యాకరణాది
బహువిధశాస్త్రములను శిల్పవిద్యలను సంపాదించి స్వస్థలములఁ బ్రవే
శించి వానిలాభములను దేశమున కొసఁగుచుండిరి.

ఇట్లు బహుయుగములు జరుగ నైరోపాఖండమునందలి 'బుడత
కీచు' లనఁబడు పోర్చుగలు దేశీయులును, 'ఓలాందు' లనఁబడు హాలం
డు దేశీయులును, 'ఇంగిలీసు' లనఁబడు నాంగ్లేయులును నీయాంధ్రావ
నికి సముద్రమార్గమున వర్తకమునకై రాఁజొచ్చిరి. అందు ముందు 'బు
డతకీచులు' స్వదేశమునుండి 'లోహమయ రోమమయ మృణ్మయ'
ములతోఁగూడిన వస్తువులనేగాక, 'మడగాస్కరు, జాంజిబరు, సుమెత్రా
ద్వీపా' దులనుండి లవంగాది భోగ్యవస్తువులఁ గూడఁ దెచ్చి నీయాంధ్రభూమి
లోఁ బరిశుభ్రవస్త్రాదికముచే వినిమయములఁ జేసికొనుచు స్వదేశమునకు
వానిఁ గొనిపోయి యట విక్రయించి విశేషలాభము నొందుచుండిరి.
పిమ్మట 'నొలాందు' దేశీయు లాపద్ధతినే యవలంబించి యాంధ్రుల
మన్ననలకుఁ బాత్రుఁ లగుచుండిరి. ఇంగిలీసు దేశీయులు తమప్రభ్వియ
గు 'ఎలిజబిత్తు' మహారాణిచే నీదేశమున వర్తకము చేయునాజ్ఞ నొంది
ప్రాక్సముద్రతీరమున నెచట వర్తకముఁ జేసిన లాభించునో యని పర్య
టనములఁ జేయుచుఁ బరిశోధింపు చుండిరి.

నాఁటికాలమునం దాంధ్రదేశములో నుత్తరభాగము గోలకొండ నవాబుల చేతను దక్షిణభాగము కర్ణాటకావనిపుల చేతను బాలింపఁబడు చుండెను. కర్ణాటకపరిభువులలోఁ గృష్ణదేవరాయలకుఁ బిమ్మట విశేష విద్యాపోషణాదికముచే విఖ్యాతిం గనిన 'వీరవేంకటపతిరాయలు' తాలికోట యుద్ధానంతరము తండ్రి యగు తిరుమలదేవరాయలు విజయనగరమునుండి యైదువందల యేనుఁగులచే మోయించుకొని పెనుగొండకుఁ జేర్చిన సువర్ణవజ్రవైడూర్యాది మహానర్ఘధనమును దిరుమలదేవరాయల యనంతరము కైవసముఁ జేసికొని 'అప్పయదీక్షిత' తాతాచార్య, అప్పలాచార్య, వేంకటాచార్య, తెనాలిరామకృష్ణ, తరిగొప్పులమల్లన, చెన్నమరాజు, మొదలగు సంస్కృతాంధ్ర మహాకవుల నాదరింపుచు నా మహాకవులచే 'కువలయానందా'ది శతాధిక సంస్కృతమహాగ్రంథములను 'పాండురంగవిజయ, చంద్రభానుచరిత్ర, చారుచంద్రోదయాది' ప్రసిద్ధాంధ్ర ప్రబంధములను రచియింపఁజేసి సకలకలాపోషకుండై ప్రజాభివృద్ధికర కార్యము లొనర్చుచు నవక్రపరాక్రమముతోఁ జంద్రగిరిపట్టణమును రాజధానిగా దక్షిణాంధ్రరాజ్యము నేలుచుండెను. *

ఆతనిపాలనమునం దాచంద్రగిరియందు, కోటికిఁ బడగలెత్తిన పెక్కండ్రువర్తకు లుండిరి. అందు 'గౌరకోమటి' యగు 'వసుమంతుఁ' డను నాతఁడు సుప్రసిద్ధుఁడు. ఆతఁడు పెక్కుకోట్లకుఁ బడగ లెత్తియుండినం దున నారాజ్యమునందలి ప్రసిద్ధ పట్టణములలోను, గ్రామములలోను నాతనియంగడులే యతిశయించెను. సాధారణవర్తకులకుఁ బెట్టుబడులు పెట్టియు, న్యాయమగు వడ్డికి ధన మిప్పిచ్చియు, గుత్తగ ధాన్యాదులఁ గొనియు, గనులఁ ద్రవ్వించి లోహములఁ జేకూర్చి విక్రయించియు,

---

*తిరుమలదేవరాయలపుత్రుఁడగు నీవేంకటపతిరాయలు, క్రీ. శ. 1585 సం॥రము మొదలు క్రీ. శ. 1644 సం॥రము వఱకు రాజ్యము చేసెను.

రత్నవ్యవహారముఁ జేసియుఁ ద్వీపాంతరములనుండియు దేశాంతరములనుండియు వచ్చిన వర్తకు లీతఁడు సత్యసంధుఁ డని నమ్మియుంచిన వస్తుతతిని న్యాయముగ విక్రయించి వారివలన విక్రయపుసుంకము (కమీషను) నొందియు, స్వదేశము నంటిన సముద్రపురేవులలోఁ దిరుగునట్టివియు ద్వీపాంతరముల కేఁగునట్టివియు నగు వివిధములగు నావలచే వర్తకమొనర్చియు, విశేషలాభముల నొందుచుండెను.

ఆతని కొలువుకూటమునం దెవ్వఁడును బేరములఁ దెలిసికొనుటకు—రత్నపరీక్షలకు—తమవస్తువుల విక్రయింపనుంచుటకు—బహువిధవస్తువులఁ గొనుటకు—నితరవర్తకపు వ్యవహారములకు—నానాదేశములనుండియు వచ్చువారుఁ—బలుభాషలు మాటలాడువారు పలువేషములు గలవారు నగు వణిజులు—ద్విభాషుల—(దుబాసీల) వలనఁ దమకార్యముల నాలోచించుచుఁ—బ్రత్యుత్తరముల నొందుచు బోవుచుండిరి.

ఆకాలమున నీ యాంధ్రభూమిఁ జొచ్చిన యింగిలీసువారికి కొలువుకూటమునకుఁ బదేపదే వచ్చి తమ యరోమాము, రోమమయ, వస్తువు లీదేశమునం దెచటెచటఁ బ్రియముగ విక్రయమగును? 'సువర్ణ, వజ్ర, శుభ్రవస్త్ర, తైల, భోజ్యాదు లెచ్చట నగ్గువగ లభించును? ఎచ్చట వర్తకశాలలు నిర్మింప సౌకర్యము కలుగును? అనెడి యంశములఁ దెలిసికొన వచ్చి వసుమంతునకుఁ గానుక లిచ్చి యాతనిచే గౌరవింపఁ బడుచుండిరి.

వేయునేల? యాతని కొలువుకూటము యక్ష, కిన్నర, విద్యాధరాదులచే నొప్పు కుబేరుని కొలువుకూటముఁ బోలె ప్రకాశింపుచుండెను.

ఆవసుమంతునకు, 'శృంగారమంజరి' యను సంస్కృతనాటకమును రచించి వేంకటపతిరాయులకుఁ గృతి నిచ్చి యాతని మెప్పు వడసిన

మహాకవియు, 'వేదవేదాంగ' వేత్తయు, సంగీతకళావేత్తయు, సంస్కృతముననే గాక యాంధ్రభాషయందును ననర్గళముగఁ గవిత్వముఁ జెప్పువాఁడును, ఉత్తమచరిత్రుఁడును, సుభాషియు, దేశదైవభక్తులు గలవాఁడును, వైష్ణవోత్తముఁడును నగు వేంకటాచార్యనామధేయుఁడు మంత్రియు గురువు నయ్యె.

హనుమంతుఁడు ప్రతిముఖ్యకార్యమును నీవేంకటాచార్యునితో నాలోచింపకుండఁ జేయఁడు. రాజస్థానమున నెట్టి దుర్ఘటకార్యములు గలిగినను నీమంత్రివరు నంపిన వాని నతిసులభముగ నెరవేర్చును. మఱియుఁ బలుభాషలు, పలుదేశాచారములు తెలిసినవాఁ డగుటచే హనుమంతునికడకుఁ గార్యార్థులుగ వచ్చు పరదేశీయులకుఁ దగుసదుపాయము లొనర్చి కార్యసాధనములఁ జేయించుచుండును. సద్గోష్ఠులలో గానకళానైపుణ్య మొప్ప భగవత్సంకీర్తనములఁ బాడి, సభాసదుల కానందముఁ గొల్పుచుండును. ఇట్లు హనుమంతుని మనస్సు నాకర్షించుటయే గాక, సతీమతల్లికయగు నాతనిభార్యకును సదుపదేశకుఁడై పరమార్థచింతను, బరోపకారనిరతిని గల్గించి పితృతుల్యుఁడుగఁ బ్రవర్తించుచుండెను.

ఇట్లుండ నొకప్పుడు వేంకటపతిరాయ మహారాజు హనుమంతు నాహ్వానించి గౌరవించి యిట్లనియె,

శ్రేష్ఠీ! మాతాత యగు శ్రీకృష్ణదేవరాయసార్వభౌముని కాలముననే పరఖండవాసులగు 'బుడతకీచులు' పశ్చిమతీరస్థ మగు 'గోవా' పట్టణముఁ జేరి వాణిజ్యము నారంభించిరి. పిమ్మట నొల్లాందు కిరాటు లీతూర్పుసముద్రతీరమునకు వచ్చి మావలననే 'ప్రళయకావేరి' సరోవరతీరమునం దాపేరితో నొక నగరమును నిర్మించుకొని వర్తకాభివృద్ధిం జేసి లాభము నొందుచుండిరి. ఇపు డింగిలీసులు ముఠాలు ముఠాలుగా

వచ్చుచు నెచట వర్తకశాలలను వేసికొనిన లాభించునో యని పరీక్షించు చుండుట నీకుఁ దెలియునుగదా! గతమాసముననే 'కరాచి, బరోచి, సూరతు' రేవులలో 'డేనులు, జర్మానీయులు, నార్వేదేశీయులు' మొదలగు పశ్చిమఖండవాసులు తమనావలతో దిగి యార్యావర్తమున వర్తకసౌకర్యములకై పరిశీలించుచున్నట్లును, ఢిల్లీశ్వరునకుఁ గానుక లర్పించినట్లును వార్తావహుల వలనఁ దెలిసినది. కాన ఖండాంతరులవలె మన దేశీయులుగూడఁ బాశ్చాత్యదేశముల కేఁగి యచటి చిత్రవిచిత్రవస్తువులఁ గొని యిచట విక్రయించియు నిచటి కల్పితవస్తువుల నచట నమ్మియు నేల లాభము నొందరాదు? "వాణిజ్యే వసతి లక్ష్మీః" అను నానుడి నేల సార్థకపరుపరాదు? అని ప్రస్తావించెను.

అంత వసుమంతుఁడు "మహారాజవర్యా! తమరు సెలవిచ్చినది యథార్థము; పాశ్చాత్యదేశప్రభువులు తమదేశపు వణిజులకుఁ బరదేశముల కేఁగి వాణిజ్య మొనరింప ననుజ్ఞ నిచ్చుటయేగాక, మనదేశప్రభువులకును వర్తకసౌకర్యములఁ జేయింపుఁడని యుత్తరములను వ్రాసియు కానుక లంపియు, దమవర్తకుల కెంతయో ప్రోత్సాహముఁ గల్గించుచున్నారు. గతవత్సరమునం దింగిలీసుదేశపురాణి 'ఎలిజబెత్తు' తమ కంపిన యుత్తరముఁ జిత్తగించితిరిగదా! అట్లే ప్రభువువారును మనయాంధ్రవర్తకులకుఁ బ్రోత్సాహ మిడి యింతవఱకు మన దేశముతో సంబంధము లేని పరదేశముల కంపినయెడల మనదేశీయు లత్యంతలాభము నొందఁగలరు. 'సముద్రశుల్కము' చేత మన ప్రభుత్వమునకును నధికాదాయము రాఁగలదు. ప్రభువువారి చిత్తమునం దిట్టి సంకల్పము కలుగుట దేశసౌభాగ్యహేతు వని తలంచుచున్నాను. తమతలఁపు లమోఘములగుఁగాక!" యనెను.

అంతఁ బ్రభువు ప్రధానమంత్రి యగు తరిగొప్పుల దత్తనామాత్యునితోఁ గొంత మంత్రాలోచన యొనర్చి, వసుమంతునిం గని 'వణిక్పుంగవా! నీయూహలు ప్రశస్తతరములు. నీవు చెప్పినట్లే యింతకుఁ బూర్వము మనదేశముతో సంబంధము లేనట్టియు, ఒలాందులచేతను, బుడతకీచులచేతను సదా ప్రశంసింపఁబడుచుండు నట్టి 'పరాసుదేశపుచక్రవర్తి' యగు నాల్గవ 'హెన్రీ' గారి కుత్తర మిచ్చుచున్నాను. ఆదేశవాసులచే నమూల్యములుగా నాదరముతోఁ జూడఁబడు "కొన్ని తైలములను, కాళహస్తి కాంస్యపాత్రములను, కంచి వస్త్రములను, తిరుపతి రక్తచందన వస్తువులను, పరిమళద్రవ్యములను, చిత్రితవస్తువులను" పరాసుచక్రవర్తికిఁ గానుకలుగా నంపుచున్నాను. కాని యాదేశమున కేఁగి గౌరవప్రదముగఁ గార్యము లొనరించు వర్తకుఁడు కావలెను. నాయూహాలో నీకంటె నధికుఁడగు కార్యసంధాత కాన్పింపఁడు. నీకుఁ దగుసౌకర్యముల నొనర్పించెదను. మార్గమధ్యమునందలి యాయాదేశ ప్రభువులకు నీకు సౌకర్యము లొసరింప నుత్తరము లొసఁగెదను. కాన నీ వీకార్యభారము వహింపవలె నని బుజ్జగింపుమాటలతోఁ బ్రోత్సహింప, నావసుమంతుఁడు సంతసించి తత్కాలావేశముచే నంగీకరించెను.

అంత రేఁడు పరాసుదేశమునుండియు మార్గమధ్యస్థదేశముల నుండియుఁ జిత్రవిచిత్రవస్తువులఁ దెచ్చుటకును, మార్గవ్యయమునకును వసుమంతుఁ డూరలేనపు డాతనిపరివార కుటుంబ పోషణాదులకును, గోటిదీనారము లొక్కపరి వసుమంతున కిచ్చి యాతనిమనంబున కాహ్లాదముఁ గలిగించెను. పరాసుదేశపు చక్రవర్తియగు నాల్గవ హెన్రీగారికిని, మార్గమధ్యస్థదేశప్రభువులకును, వసుమంతుని గౌరవింప నుత్తరములు * 'రాయసకాఁ'డును, వివిధభాషా కోవిదుఁడు నగు మల్లనకవిచే

* తరిగొప్పుల మల్లనకవి వేంకటపతిరాయలకడ 'రాయసకాఁడు' (లేఖకుఁడు) నని చంద్రభానుచరిత్రలో నాకవియే వ్రాసికొనెను.

వ్రాయించి యిచ్చెను. పై సన్మానాదులచే వసుమంతుఁ డుప్పొంగుచు రాజుకడ ననుజ్ఞ నొందెను. దత్తామాత్యుఁడును నాకాలమున నాలవ హెన్రీచక్రవర్తికి మంత్రియై ప్రాన్సుప్రభుత్వమె యూరోపాఖండమునం దగ్రగణ్యముగాను, హెన్రియే నియంతగాను నుండునట్లు చేయ యత్నించెడు 'సల్లీ' యనునాతనికి, 'హాలండు, పోర్చుగీసు, ఇంగిలీసు' దేశీయులకంటె మీకీయాంధ్రదేశమున నెక్కుడు వర్తకసదుపాయములఁ జేయుదుముగాన నిటకు రండని యాహ్వానింపుచు వ్రాసిన యుత్తరమునుగూడ నంది,* వసుమంతుఁడు స్వగృహమునకు వచ్చి యింట నడుగిడగానె, 'కారుమెఱుఁగు రాచిలుక వలెను, కస్తూరివీణభాతిని, పదాఱవవన్నె బంగారముపోలికను, వెన్నెలలోని తేటమాడ్కిని, కలుములచెలి ననుకరింపుచు నెదురుగఁ గాన్పించెడి యలోకసామాన్య యగు భార్యం గాంచి, ఈయొప్పులకుప్ప నెట్లు విడిచి పరదేశముల కేఁగఁగలను? అని పూర్వోత్సాహము డించి, డింది, చింతింపుచు నిట్టూర్పు విడుచుచుండ నొక్క వృద్ధదాసి సన్నిధి కేతెంచి "బాబుగారూ! అమ్మగారికి మూఁడవమాసము వచ్చెననియుఁ దమకుఁ బుత్త్రుఁడు పుట్టుననియు స్త్రీలు చెప్పుకొనుచున్నా" రన, వసుమంతునిభార్య నేలఁ గాలిబొటనవ్రేలిని వ్రాయుచు సిగ్గుచేఁ దలవంచుకొనునంతలో, నత్యవసరకార్యములకై నల్వురు లేఖకులు త్వరపడుచు రాఁగా, దాసియు వసుమంతునిల్లాలును నంతర్గృహమున కేఁగిరి. వసుమంతుఁడు లేఖకులు తెల్పిన యత్యవసరకార్యమగ్నుఁ డగుటచే నవస్థాంతరగతుఁడై విచారమును బ్రయాణాంశమును నాఁటికి మరచెను.

---

* ఈయంశము 'మల్లనామాత్యుడు' రచించిన 'చంద్రభానుచరిత్ర' యందు దత్తామాత్యునిఁగూర్చి వ్రాయుచు, నాతఁడు ద్వీపాంతరప్రభువులను స్వదేశమున కాహ్వానింపుచు లేఖలను వ్రాసె ననుటచే నుల్లిఖితమైనది. చూ. చంద్రభానుచరిత్ర 1-40

మరునాఁటి పలువాతనె మహారాజు ఖండాంతరప్రయాణ మేపు డు చేయుదు వనియు, నీ కేదేని ప్రయాణోచితవస్తుసంభార మవసర మైన దానిని రాజపురుషులు సమకూర్చెద రనియు వర్తమానము చే యఁగా వసుమంతునిచింతలు పునరుద్ఘాటితము లయ్యెను. రాజులకడఁ జెప్పినమాట లమోఘములు కావలెను. లేకున్నఁ బెక్కు లుపద్రవము లు సంభవించుట లోకానుభవము గదా!

అపుడు సన్నిధి నున్న గురువర్యుఁ డగు వేంకటాచార్యునితో వసుమంతుఁడు 'ఆచార్యవర్యా! నే నొక్కచిక్కులోఁ దగుల్కొంటిని. దీనికిఁ గర్తవ్యము సెలవీయ వేఁడెదను. అదేదన, నిన్నటిదినమున మ హారాజుతో సంభాషించునపుడు ఖండాంతరులి దేశమునకు వచ్చి వర్త కముఁ జేయుచు విశేషలాభముల నొందుచున్నారనియు, మనదేశీయులు ను, నన్యఖండముల కేఁగి వర్తకము నేల చేయరాదనియుఁ బ్రశంస కలు గ దానిని నే నామోదించితిని. అందులకు మహారాజు నన్నే ఖండాంత రస్థమగు పరాసుదేశమున కేఁగవలయు నని యెంతయో సన్మానించుట యేగాక, నామార్గవ్యయాదులకుఁ గోటిదీనారములను, ధాన్యింసుచకవి వ రికిని మార్గమధ్యస్థదేశప్రభువులకును, నాకు సదుపాయములఁ జేయుఁడని లేఖలను, పరాసుపప్రభువునకుఁ గానుకలను గూడ నిచ్చి యున్నాఁడు. తత్కాలగౌరవమోహితుఁడనై నే నాప్రయాణమునకు సమ్మతించితిని. కాని, గృహమునకు రాఁగా, నట్టికళత్ర బంధు మిత్ర పరివారాదులను ధనధాన్యాదులను వీడి, పరదేశములకుఁ బోఁగల ననువిచారము కలుగు చున్నది. దీనికి మీ రేమియాలోచన చెప్పెదరు?" అన నాచార్య వర్యుం డిట్లనియె.

"శ్రేష్ఠివర్యా! వెనుకముం దాలోచించి, దేశకాలపాత్రముల నూహించి, స్వశక్తిని జూచుకొని తేనికడ సంభాషింపవలయుఁ గాని,

తద్వ్యతిరేకముగ మాటలాడి పిదప విచారించిన లాభమేమి? దైవయోగమున నీవేదియు యేలికకడఁ జేయుదు నని చెప్పి పిమ్మట పశ్చాత్తాపమునొందుట యుక్తమా? రాజాజ్ఞకు వ్యతిరేకముగ సంచరించిన సిరిసంపదలకును, ప్రాణములకును ముప్పు రాదా? కాన సర్వవిధముల నీవు రాజుకడఁ బలికినరీతిని ఖండాంతరముల కేఁగి కార్యమును నెఱవేర్చుటయె యుక్త" మని ధైర్యముఁ బురికొల్పెను.

అంత వసుమంతుఁడు తారాబలచంద్రబలయుక్తమును, శుభామృతానంద యోగాది సహితమును నగు ముహూర్తమును నిశ్చయించుకొని మహారాజునుదలఁ గొని ప్రయాణోచిత సంభారములకు, గుడారపుసామానును, బహుభాషలు నేర్చి, వర్తకనైపుణ్యము, మాటలందు నేర్పరితనమును, గలిగి తనతో సమానులును ధైర్యశాలురునైన కొందఱు గొరకోమటులఁ గూడఁ సిద్ధపఱచి, 'పశ్చిమకావేరి' రేవున మూఁడోడలను ప్రయాణమున కేర్పఱచి, సామానును వానిలోఁ జేర్చ నంపి, బంధుమిత్రాదుల యనుజ్ఞను బెద్దల యాశీర్వాదములను నందెను. పిదప నంతిపురి కేఁగి, 'మనంబునఁ గల దుఃఖముచేఁ గలువలవంటి కన్నుల నుండి వేడిసీరు ప్రవహింపుచు గండస్థలిపైఁ బ్రవహింపఁ, దనులత చెమర్చుచుఁ గంపమొంద, వేడి నిట్టూర్పుతో, మృదుమధురోక్తి తొట్రుపడఁ దన పాదములపై వ్రాలిన సతీమతల్లికను, వసుమంతుఁడు కించిదూనముగాఁ దత్సదృశావస్థనె పొందుచు లేవనెత్తి యాదరించి, పురుషుఁ డగుటచే ధైర్యముఁ బురికొలిపి, నాఁటిరాత్రి 'శన్యుషఃకాలమున' శుభశకునముల గైకొనుచుఁ బయనమయ్యెను.

వసుమంతుని సాగనంపవచ్చిన బంధుమిత్రులతోఁ గూడిన వేంకటాచార్యుఁడు "శీఘ్రపునరావృత్తి యగుగాక !" యని యాశీర్వదింపుచు గురూపదేశముగ నీక్రింది పద్యమును జంట యాపలుగలిగి మొ

నతోఁ గూడునట్లు గీయఁబడిన తాటాకుపైఁ లిఖించి "శ్రేష్ఠీ! ఇందు వ్రాసిన పద్యభావమును నీవు చేయు ముఖ్యకార్యములకు ముందొకసారి చదువుకొని పరివర్తింపుచుండు" మనెను.

* గీ. అతిరయంబున నొకకార్య ♦ మాచరించు
నతని యవివేక మఖిలాప ♦ దాస్పదంబు
తెలిసి సత్కార్యభాగవ ♦ ర్ధిష్ణుఁడైన
ప్రాజ్ఞుఁడు కృతపరిలబ్ధసం ♦ పదలఁ బొదలు.

ఆపద్యముగల తాళపత్రమును వసుమంతుఁడు వందనముతో నందుకొని తన మొలనున్న కత్తి యొరయం దిముడుటచే నందు దాని బదిలపఱచుకొని వెడలెను.

వసుమంతుఁ డట్టిల్లు విడిచి ప్రళయకావేరి రేవునందు నావలపైఁ దోడివారితో నధిష్ఠించి, యోడలకు లంగరు లెత్తింప నరంగులు సముద్రముయొక్క లోఁతును దిక్కులను దెలియు దేశీయదిక్సూచీ ♦ యంత్రములచే నక్షాంశములఁ దెలిసికొనుచుండ నుత్తరాభిముఖముగాఁ బ్రయాణము సాగించెను. మార్గమధ్యమునం దాయోడలు 'మాలిమికాండ్రి' నేర్పుచే సముద్రభంగములచే భంగము నొందక, కతిపయదినములకు 'వంగ' దేశము నందలి గంగాసాగర సంగమక్షేత్రముఁ జేరెను.

---

* ఈపద్యము 'భారవి' మహాకవికృత 'కిరాతార్జునీయకావ్యము' లోనిదానికాంధ్రీకరణము. వనవాసఖిన్నుఁడై కౌరవులపై యుద్ధమునకు దూఁక నుంకించు భీముని ధర్మజుఁడు శాంతినొందింపుచుఁ జెప్పినభాగము లోనిది.

శ్లో॥ సహసా విదధీత నక్రియా । మవివేకః పరమాపదాం పదమ్।
వృణుతే హి విమృశ్యకారిణం । గుణలుబ్ధాస్స్వయమేవ సంపదః ।। 2-29

♦ దేశీయదిక్సూచీయంత్రనిర్మాణముఁ గూర్చి 'విశాఖపట్టణముజిల్లా' వృత్తాంతసంగ్రహ మనుగ్రంథమున వ్రాయఁబడెను.

అట సముద్రతరణులనుండి వసుమంతుఁ డవతరించి నదీ తరులఁ దమవస్తువుల నెక్కించుకొని 'పాటలీపుత్రా'ది మహాపట్టణములఁ జూచుచుఁ, గొన్నిదినాలకుఁ 'గాశిం' జేరెను. అట 'మణికర్ణికా'లోఁ గ్రుంకు లిడి విశ్వనాథుం దర్శించి, ప్రయాగ క్షేత్రమున కేఁగి, నావికామార్గమును వదలి 'కంచెరల'లో దనసామానును నెక్కించుకొని సార్థవాహులఁ గూడి కతిపయ దినములకు ఢిల్లీపట్టణమునకుఁ బోయెను. అట కొన్నిదినములుండి 'అక్బరుచక్రవర్తి' దర్శించి తమప్రభు విచ్చిన యుత్తరమును సమర్పింప నాసార్వభౌముఁ డెంతయు గౌరవించి వసుమంతుని 'అఫగనిస్థానము' దాఁటువఱకుఁ దగు రక్షకభటాది సౌకర్యముల నొసర్ప రాజపురుషుల కనుజ్ఞ నొసఁగుటయేగాక, పారసీక ప్రభువునకును వసుమంతు నెఱఁగింపుచు నుత్తర మిచ్చెను. అందువలన వసుమంతుఁ డుప్పొంగుచు నిర్భీతితోఁ బ్రయాణమును సాగించెను. మార్గమధ్యమునందుఁ బ్రాచీనకాలము నుండియుఁ బ్రసిద్ధికెక్కిన వీరులు, నాజానుబాహులు నగు, పాంచాలురు, అఫ్రిదీలు, మొహమండ్లు మొదలగు నాయుధజీవిక సంఘములను, కైబరుకనుములను, గాంధార, మద్రదేశములను, జూచి యానందాశ్చర్య మగ్నుఁడగుచు వాయువశమున స్తంభాకృతిం దాల్చు నిసుకస్తంభములచే భీకరావహము గొలుపు నెడారులలో నుష్ట్రముల నధిరోహించి వెళ్ళుచు, సుందరులు, భోగులు, కవులు, సూరులు, శూరులునై, యొకప్పుడు భారతీయార్య సంఘములలోనివారయ్యుఁ, గాలాంతరమున వేఱుపడి, 'జందవేస్త' వేదోదితకర్మకలాపముల నాచరించుచుఁ బిమ్మట మహమ్మదుప్రవక్త ప్రోద్బలముచే నిస్లాం మతావలంబకులైన, పారశీకుల దేశముం బ్రవేశించి రాజధాని యగు 'టెహిరన్' పత్తనమును జేరెను.

అట 'షాహిన్‌షా' బిరుదము వహించిన సార్వభౌముని దర్శించి, 'అక్బరు' ప్రభువిచ్చినలేఖ నందియ్య, నాచక్రవర్తి సగౌరవముగా, 'షా

గ్దాదు' నందలి ప్రభువునకు హనుమంతుని ప్రయత్నముఁ దెలుపుచు లేఖ నిచ్చెను. దానివలన నాంధ్రపర్యటకుఁడు సంతోషముతో నొంటెలపై సామానుతో, సహచరులతో, సార్థవాహులతోఁ గూడి, బాగ్దాదుపురిఁ జేరి, యట రాజదర్శనమొనరించి, చక్రమార్గమైనను దర్శనీయమైనదగు టచే 'ఇస్తంబూలు'న కేఁగుటకు బాగ్దాదుప్రభునను మతి నొందెను. అట నుండి ఖర్జూరమధుపానముచే, శరవేగ నదీ (టైగ్రిసు) స్నానముచే నా నందింపుచు, భారతీయవాఙ్మయమునందు 'అసురులు' అనఁబడు 'అస్సీ రియనులఁ' జూచుచుఁ గొన్నిదినములకుఁ జంద్రశిలా (మార్మోరా సముద్రవేలంజేరి) దానిం దరులచేఁ దరించి, ఇస్తంబూలునకుఁ (కాన్ స్టాంటినోపిల్) జేరెను.

అచ్చటఁగల వింతలఁ గొన్నిదినములు చూచి, మహమ్మదీయ మతమునకు జగద్గురువును, తురుష్క సామ్రాజ్య చక్రవర్తియు నగు 'ఖలీఫా' ను దర్శించి తత్ప్రభుసమ్మతితో, రత్నాకరమునందు నావలను సపరివారముగా నధిరోహించి 'డార్డినెల్సు' జలసంధిలో నిరువైపులనుండు మహోన్నతపర్వతశృంగములం జూచునప్పుడు రాజమహేంద్రపురినుండి భద్రాచలయాత్రకు గోదావరీనదియందుఁ బడవలలో నేఁగునపుడు కా న్పించు, 'పాపి' కొండలు జ్ఞప్తికి వచ్చుచుండఁ, గొన్నిదినములకు 'మ ధ్యధరా సముద్రము' నందలి ఫ్రాంసుదేశపుతీరమునఁ బ్రధానవర్తకస్థా నమగు 'మార్సెల్సు' అను రేవునం దోడలు చేర, నందు సపరివారము గా దిగి, యచట సుంకము' లను గొను నధికారికిఁ దమప్రభు విచ్చిన యుత్తరముఁ జూప, నాతఁడు హనుమంతునకుఁ దగు వసతిం జూపెను. పిమ్మట నాతఁడు గుఱ్ఱపుబండపై హనుమంతుని సపరివారముగా 'పారీ సు' మహాపట్టణమున కంపెను.

ఆకాలమునం దాపరాసుదేశమును, నిర్వక్ర పరాక్రమముతో 'నాల్గవ హెన్రీ' చక్రవర్తి పాలించుచుండెను. మనవసుమంతుఁ డాచక్రవర్తిని దర్శించి 'వీరవేంకటపతిరాయప్రభు విచ్చిన యుత్తరమును, కానుకలను చక్రవర్తికిని, దత్తనామాత్యుఁ డిచ్చిన యుత్తరమును 'సల్లీ' మంత్రికిని సమర్పింపఁగా, వారిరువురు నత్యంతానందముతో నావర్తకుని గౌరవించిరి. పరాసుదేశమునం దాతఁ డుండునంతకాల మాతనికిఁ దగు సౌకర్యము లొనర్ప నేర్పాటులు 'సల్లీ' చేయించుటయే కాక, యాదేశమునందలి గొప్పవర్తకులను రావించి వారలతో వసుమంతునకుఁ బరిచితిని గాఢఁ గావింప, వారావర్తకుని దమదేశమునఁ గల వివిధపరిశ్రమలు చేయుచోటులకుఁ గొనిపోయి, తమవస్తూత్పత్తి విక్రయాదులఁ గూర్చి బోధనములఁ జేసిరి. వసుమంతుఁడును, దమదేశపు వర్తకసౌకర్యములకును, పరాసుదేశపువర్తకసౌకర్యములకును గల భేదములను గుర్తింపుచు, ఫ్రాంసుదేశ మంతయుఁ దిరిగి తిరిగి 'పారీసు' నగరముఁ జేరెను.

తొలుత పరాసుదేశీయు లెంతటిశుభ్రస్వరూపులో ఎంతటిశుభ్రవస్త్రాలంకారములు, మృదూక్తులు గలవారో, వారంతటిశౌచాభావ, స్నానాభావ, దంతధావన నియమాభావు లనియుఁ, గోమాంసభక్షకు లనియుఁ, దెలిసికొని యసహ్యపడెను. కాని, కాలాంతరమున వారితోఁ గలిసి మెలిసి యుండుట కిష్టపడెను. ఆదేశీయులలోఁ గల స్త్రీపురుషస్వాతంత్ర్యాదులను, వారి స్వేచ్ఛావిహారాదులను, జూచుచు 'సీను' నదీతీరమునందలి నాట్యములందు స్త్రీలయొక్క స్వేచ్ఛాసంచారములలోఁ జూపఁబడు 'కిలికించిత, కుట్టమిత, బిబ్బోక, మోట్టాయితా' ది, హావభావములకు సొక్కుచు, మధ్యధరాసముద్రతీరమునందలి ద్రాక్షావన ప్రదేశములకుఁ బోయి యచటి నరనారీకముయొక్క మర్యాదలను, ద్రాక్షాసవపాన విహారములను వీక్షింపుచు, పారీసుపట్టణ విహారవనముల

విహరింపుచుఁ దత్రత్యప్రభుమర్యాదలకు, విందులకు, విహారములకు లో నై చొక్కుచు, గృహమును, గృహిణిని, గృహ్యములనుగూడ మఱచి పదుమూఁడేండ్లు ఫరాసుదేశమునం దుండెను.

ఇట చంద్రగిరిలో వసుమంతుఁడు ఫ్రాంసుదేశమున కేఁగు నాఁటికే గర్భవతియుఁ బతివ్రతయు నగు నాతనిసతి, పతిదేశాంతరగతుఁ డగుట కెదలో నతివిచారమగ్నయయ్యు, గురువర్యునియొక్కయు నాత్మబంధువులయొక్కయు దీవనపువాక్యములచే నెటులనో వియోగదుఃఖమును సహింపుచు వసుమంతుఁడు ఫరాసుదేశమును బ్రవేశించునాఁడె, చంద్రుం బోలినమోము, కలువలవంటి కన్నులు, సురూపము గలిగి, వంశవర్ధనుఁ డైన సుపుత్త్రుం గని, తండ్రి యిట్టిబిడ్డం జూడక దేశాంతరగతుఁ డయ్యెనే యను విచారమును, బాలునిసౌందర్యవిచేష్టితాదులఁ జూచుచు నానందమును బొందుచుఁ, గాలముఁ బుచ్చుచుండెను. పిదప బాలుఁడు పంచశరద్వయస్కుఁ డగు నప్పుడు, తన గురునిచేత నక్షరాభ్యాస మొనరింపించి, చదువుఁ జెప్పించుచుండెను.

శ్రీ వేంకటపతిరాయ మహారాజును, వసుమంతుఁడు వెళ్ళినపిమ్మట, నతనిసంసారపు మర్యాదలకును, నాతనివర్తకమునకును లోటు రాకుండఁ దగుసౌకర్యములఁ జేయింపుచుఁ బతిదేవత యగు నాతనిభార్య సుఖప్రసవమై బాలుని గనినందుల కానందింపుచు, నాబాలుని యోగక్షేమములఁ దగ నారయుచుండెను.

ఇట్లుండఁ బదుమూఁడేండ్లు కడచినను వసుమంతుఁడు తిరిగి రాకుండుటకు మహారాజు విచారించి, స్వదేశమునకుఁ బోవునొక హాలండు దేశీయునిచేత 'మీదేశమునందుండు మావసుమంతుని మాదేశమునకంపుఁ' డని ఫ్రాంసుదేశ చక్రవర్తియు, బాలుఁడు నగు 'పదుమూఁడవ లూయీ' కి రీజంటగు 'మేరిడిమెడిసి' అను నామె కొకయుత్తరము

సంపెను.* ఆయుత్తరము నాయొలాండు దేశీయుఁడు 'పారీసు'న కేఁగి 'రీజంటున' కీయ, నాను వసుమంతుని బిలిపించి యాయుత్తరమును విని పించి వెళ్ళ నాజ్ఞాపింప, నాతఁడు పూర్వస్మృతి నొంది, ఫ్రాంసుప్రభుత్వము తనరాజున కిచ్చు కానుకలఁ గైకొని స్నేహితులగు 'రిచ్లూ, క్లాడరు' మొదలగు వారిని వీడ్కొని వారలచే బహూకరింపఁబడి, వారి నాంధ్రభూమికి రా నాహ్వానించె. అట బహువిధములగు చిత్రవిచిత్ర వస్తువులఁ గొని సపరివారుఁడై 'మార్సేల్సు'లో మూఁడు పరాసుదేశీయుల యోడలఁ గుదుర్చుకొని వెచ్చఁదనము నిచ్చు భూమధ్య సముద్రమార్గమున 'సితాసిత' నదుల (వైట్ నైల్, బ్లూనైల్) కూడికచేఁ బవిత్రవంతమైనదని వేదమునఁ జెప్పఁబడు* 'నైలు' నదీముఖద్వారమునం దోడలను దిగి, స్నానాదుల నొనర్చి. ప్రసిద్ధి కెక్కిన 'అలగ్జాండ్రియా' పట్టణముఁ జూచి 'సూయజు' నామకభూసంధి ప్రదేశమునందు 'ఎడారి యోడలు' అను బిరుదునొందిన 'లొట్టియల'పై సపరివారుఁడై, ఆఫ్రి

---

* వసుమంతుఁడు పరాసు దేశమున కేఁగునాఁటి కాదేశము 'నాల్గవ హెన్రీ' పాలింపుచుండెను. అతఁడు క్రీ. శ. 1610 సం॥రమున హత్య గావింపఁ బడెను. ఆతని మంత్రియగు 'సల్లీ' కూడ మఱికొన్ని మాసములకె మృతి నొందఁగా నప్పటి కైదేండ్ల బాలుఁడగు పదుమూఁడవ 'లూయి' చక్రవర్తి యయ్యె. ఆతని తల్లియగు 'మేరిడి మెడిసి' అను నామె సంరక్షకురాలు (రీజెంటు)గా నుండెనఁట!

* "నల్లని తెల్లని నదులకూడికగల చోటున స్నాన మాచరించిన మనుజులు స్వర్గము నొందుదురు. ఎవ రాస్థలమున మృతి నొందుదురో వారమృతత్వము నే పొందఁగల రు" అని క్రింది మంత్రము చెప్పుచున్నది.

మ. సితాసితే సరితే యత్ర సంగతే । తత్రాప్లుతాసో, దుత్పతంతి ।
యే వైతన్వాం విసృజంతి ధీరాః । తే జనాసో అమృతత్వం భజంతే ॥

ఈయర్థముగల ప్రదేశము గంగా, యమునా నదులు కూడు 'ప్రయాగక్షేత్రమునకును, బ్లూనైట్ నదులు కూడు 'కార్టూం' అను ప్రదేశమునకును మాత్రమే వర్తించును

శాఖండమునందలి విచిత్రవస్తువులను సేకరించుచుఁ బండ్రెండు యోజనములు ప్రయనమును సాగించి, 'ఎఱ్ఱ' సముద్రముఁ జేరెను. అట భరత ఖండమునందలి సింధుదేశీయులగు తురుష్కుల యోడలు ప్రయాణమునకు సిద్ధమగుచుండ వానిపై నారోహించి, రెండుపార్శ్వములందును తప్తలోహములవలె నెఱ్ఱనై కనుచూపుమేర నెచ్చటను వృక్షగుల్మాదులు లేకయుండు 'వేలలు' గలిగి రక్తముభాతి నెఱ్ఱనిరంగుగల నీరితో నొప్పు సముద్రముపై 'జిడ్డా, మసాని' మొదలగు రేవులలో నాఁగుచు నూటయిరువది యోజనములు విసుగుతోఁ బ్రయాణ మొనర్చి అరేబియానామక సముద్రమున నోడలు ప్రవేశింపఁ జల్లనిగాలిచేఁ బ్రయాణికులానందించిరి. పిమ్మట పారశీక సింధుశాఖను దాఁటి, బెలూచిస్థానతీరపు 'గ్వాడర్, పస్నాని, సోన్మియాని*' రేవులఁ జూచుచు వసుమంత్వాదులు 'బోరిబి' రేవుఁ జేరిరి. అచటి కంతకుముందే వచ్చియున్న వసుమంతునియొక్క తరణులలోనె సామానునంతను జాగ్రత్తగ దింపుకొని యానందింపుచు, స్వదేశవృత్తాంతములఁ దెలిసికొనుచు యాత్రికులు పయనమొనర్చి 'కన్యాకుమారి' భూమ్యగ్రమును జుట్టి 'మన్నారుసింధుశాఖా' మార్గమున 'ధనుష్కోటి'లో నాఁగ యట 'సేతుస్నాన, రామేశ్వరదేవ' దర్శనములచేఁ బవిత్రుల మైతి మని తలఁచుకొనుచుఁ బ్రయాణ మొనర్చిరి. పిదప స్వల్పకాలములోనె ప్రళయకావేరి రేవులో నోడలకు 'లంగరు' వేయ యాత్రికు లానందించిరి.

ఓడ దిగినవెంటనే వసుమంతుఁడు తనభృత్యులకుఁ బదిలముగ వస్తువులం దెండని యాజ్ఞాపించి, మజ్జనభోజనాదుల నాచరించె. తాను ఫ్రాన్సుదేశమున కేఁగునపుడు 'మీనులవంటి నేత్రములు, ముకురములఁ

* ఇపు డీ రేవుల పేరులె భాగ్రఫీలో కాన్పింపవు. 80 సం॥రాల నాఁడని ప్రచారమున నుండెను.

బోలు చెక్కిళ్ళు, దొండపండుం బోలు నధరోష్ఠము, బిసములు ననుక రించు బాహువులు, నెమలిపురిం బోలు కచముం గలిగి, విచారమగ్న మానసయై సాగనంపిన తనసతి మనంబునం బొడకట్టం గామశరవిద్ధుండై త్వరిష్యమాణ మానసుం డయి యారాత్రియె తన సతిం జూడవలె నని తలంచె. అంతం దా నరబ్బీదేశమునం గొనిన యవనాశ్వము నారో హించి, దౌడులో గుఱ్ఱమును 'పేరెము వారింపుచు' నిట్లనుకొనెను. నే నూరలేనపుడు నాసతి యెట్టివెతలం బడెనో! యెట్లు నావిరహమును సహించెనో! ఎట్టికష్టము లొందెనో? యనియు, స్త్రీలచిత్తము చంచల మందురు. ఏమో! నాయెడంబాటుచే నామెప్రవర్తన/మెట్లుండెనో యని యుం బరిపరివిధములం దలంచుచు నర్ధరాత్రమునకె చంద్రగిరిలోని తన గృహమునకుం జేరి యశ్వమునుండి దిగెను. నిశీథ మగుటచే నాతని రాక యేరికిం దెలియలేదు. ఆసమయమున వసుమంతునిభార్య, సిందుదీపము లతో నొప్పు సౌధమునందు స్వచ్ఛమగు పానుపుపై దగ్గఱ పదునాలు గేండ్ల బాలునితో నిద్రింపుచుండెను. వసుమంతుం డాపెం బరీక్షింపం బెడదారి నామె నిద్రించు నంతర్గృహముం జేరి యొకపురుష విగ్రహము తో నిద్రించు తనభార్యం గాంచి నివ్వెఱపడి 'హా! మోసపోతిని. స్త్రీ చిత్త మెంతచంచల' మని క్రోధతామ్రీకృతేక్షణుండై మొలనున్న చే రకత్తియుం దీసి యొక్కపోటుతో భార్యయసువులం దీయ నుంకించి బ హుకాలమునుండి యొరనుండి తీయని దగుటచే బిగిసియున్న యాఖడ్గ మును గట్టిగ కోశమునుండి లాగెను. అపు డాకత్తితోం గూడ గురువు వ్రాసి యిచ్చిన పద్యముగల తాటాకును నూడి మృదువైన యాతని పాదముపైం బడి దానియాను కించిద్బాధాకరముగ గుచ్చుకొనెను. అందువలన నతం డిదేమి'యని దానిం జూడ, నందు "తొందరపడి యేకార్యమును జేయకుము. తెలివితక్కువగు నట్లు చేసితివేని యాపదల

నొందుదువు. ఆలోచించి పని చేసినవానిని గుణలుబ్ధములై సంపదలు పొందును.

అను నర్థముగల పద్యము కనుపింపఁ, గొంచె మాలోచించి భార్యశయ్యను సమీపించి చూడ నామెకడ నిద్రించువాఁడు బాలుఁడు గాని, యువకుఁడు కాఁడనియుఁ, దనసతి ప్రోషితభర్తృక, యగుపతివ్రతవలె మలినయుఁ గృశయునై జడలువైచిన శిరోజములు కలదిగా నున్నదనియుఁ, బరిశీలించి హా! ఎంతటితప్పుఁ దలఁచితిని! నాకీ గురూపదేశపత్రి మీనాఁడు కనిపించి నావంశమును నిలిపినది. లేకుండిన నాభార్యయు నేను నేమగుదుమో గదా! ఈబాలుఁ డెవ్వఁడు ? నాభార్యపోలికలు నాచిన్నెలు వీనియందుఁ దోఁచుచున్నవి. అయిన రేపీయంశముఁ బరిశీలింతు నని, వచ్చిదారినె చప్పుడు గాకుండఁగ వెనుకకుఁ బోయి యెలుఁగలనో వేగించి తెల్లవారఁగనే స్వగృహమున కప్పుడె వచ్చినట్లు చేరెను.

వసుమంతుఁ డింటఁ బ్రవేశింప నాతని బంధు మిత్ర పరివార మత్యంతానందముతోఁ జుట్టుకొనెను. ఇంతలో వసుమంతుని యిల్లాలు, భర్త వచ్చెనను నానందాతిశయముచేఁ బెక్కేండ్లనుండి యభ్యంజన మొనర్పకుండుటచే మలినమైన శరీరమును లోధ్ర కుసుమపిష్టముచే నల్గుచేసికొని పద్మినీజాతి స్త్రీత్వమును పరిమిళితదేహముచేగూడ సార్థకపఱచియు, జిగిమేని కొకవింతసొగసుఁ గూర్పఁ బైఠాణి రవికను మధురచీరను ధరించియు, కాటుకపిట్టలఁబోలు కన్నులసౌందర్య మినుమడింప రేఖలు దీర్చి కాటుకఁ బెట్టుకొనియు, నిలువుటద్దముఁ జూచుకొనుచు నర్ధచంద్రునిభాతిఁ బ్రకాశించు నెమ్మొగమునఁ గస్తురితిలకముఁ దిద్దియు, పెక్కేండ్లనుండి చిక్కుపడియున్న నెఱికురులకు జవ్వాదిపదు నిచ్చి వింతగ ముడిచి కేకికచ యనిపించుకొని, నిలువెల్ల నొకవింత యొఱపుమెఱయు

వివిధరత్న ఘటితాలంకరణములను ధరించియు, మన్మథసామ్రాజ్యలక్ష్మివలె వినయలజ్జానందములచేఁ దనులత కంపింపఁ బ్రాణనాథు పజ్జఁ జేరి యాతనిపాదపద్మములకు మ్రొక్కి నిలిచెను.

అంత వినయసౌశీల్యాది యుక్తుఁడును కించిదూనచతుర్దశ వర్షప్రాయుఁడును నగు నతనిపుత్రుఁడు 'బంధు హిత గురు పురోహితసహితుఁడై తండ్రికడ కేతెంచి మ్రొక్కి వసుమంతుఁ డాదరించి యాబాలుని నంకతలమున నాసీనుఁగాఁ జేసికొని యుండియు నీతని జననాదు లెట్టివని సంశయింపుచుండఁ, గులవృద్ధులు, గురువును నాతనితో నీవు ఖండాంతరముల కేఁగునాఁటికి నీభార్యకు నెల తప్పుట యెఱుఁగవా? యనిరి. అంతలో వృద్ధదాసి వచ్చి ప్రభువా! నేను నీ ప్రయాణము నెక్కి యనఁగా, అమ్మ గర్భవతి యని చెప్పితినిగదా! యని యందఱికడ సంశయవిచ్ఛేద మొనర్ప సతీ సుత పతు లానందయుక్తులైరి.

అంతలో ఖండాంతరముల కేఁగి వచ్చిన వసుమంతుని రాక వినిన వేంకటపతిరాయ మహారా జాతని వేగమె తనకడకు రావలయునని వర్తమాన మంపెను. వసుమంతుఁడును, పేరోలగమునం దుండిన మహారాజును దర్శించి, మ్రొక్కి అతిలోక చారిత్రుఁడగు నాపృథ్వీపతిచే సగౌరవముగ నాదరింపఁబడెను. పిమ్మట వసుమంతుఁడు తాఁబోయివచ్చిన యాయాదేశముల వృత్తాంతములను, తత్తద్దేశ ప్రజల యాచార మర్యాదలును, ప్రభువుల బలపరాక్రమ విభవాదులును, దన కాయాచోటులఁ గలిగిన కష్టసుఖములను జెప్పి, రాజుయొక్కయు, సభాసదుల యొక్కయు మనంబుల కత్యాశ్చర్యానందంబులఁ గలుగఁజేసెను.

ఆసమయమునకె నావలనుండి దింపఁబడి, బండ్లపై-గుఱ్ఱములపై-నెద్దులపై-నేనుఁగులపై-నెక్కింపఁబడి తేఁబడిన వివిధవస్తుజంతు తతియు, రాజహజారమునకు సేవకులు కొనిరా, వసుమంతుఁ డావస్తుతతిని మహారాజునకు వానివాని విలువలతో నెఱిఁగింపుచు నిట్లు చెప్పెను.

"ప్రభువర్యా ! చిత్తగింపుఁ డని, భారతీయులకుఁ బరిచితిలేని నల్లని వజ్రములు, తెలిదీవిలోఁ బుట్టిన పద్మరాగమణులు, ముదిరి నీలమణులు కాఁబోనుండి పుష్యరాగములు, తుమ్మెద తళుకు గల్గెడి 'ఇళావు నీలమణులు' మంచపుకోడులకుఁ బనికి వచ్చునంతటి దృఢదీర్ఘయుక్తములగు పగడములు, * పారసీకసముద్రమునఁ బుట్టిన నిమ్మకాయలంతలేసి యురువుగల యానెముత్తెములు, పెక్కులితరమణులు, మక్కా జలతారుతివాసులు, వివిధపక్షితూలికాయుక్త శయ్యలు, అట్టిదిండ్లు, పారశీక కంబళములు, ఈజిప్టుపత్తిబట్టలు, ఫరాసుదేశపు చాంపెయినీమద్యము, అసురదేశపు ఖర్జూరమధువు, రోమకదేశపు జంత్రివాద్యమగు ఫిడేలు, ఆఫ్రికాయందలి దీర్ఘాంగ గజములు, బర్బరదేశపు వామన కరులు, నరవానరాకృతులు రెండును గలిగియున్న కాంగోదేశములోని యర్ధమనుష్యులు, వివిధదేశ ప్రజలు ధరించు వస్త్రాభరణములు, బహువిధ లోహశిలాపాత్రలు, వివిధచిత్రాభరణములు, బహువిధధాన్యములు, నైకవృక్షబీజములు, యవన, పారశీ, కాజానేయ కాంభోజాశ్వములు, వివిధములగు ముకురములు, పెక్కండ్రు చక్రవర్తులయొక్కయుఁ బ్రజ్ఞావంతులయొక్కయు సుందరులయొక్కయుఁ బ్రతిబింబములును", వీని నన్నిటిని వేర్వేఱుగఁ జూపి మహారాజుయొక్కయు, సభికులయొక్కయు మనంబుల నానంద వాహిని నుప్పొంగఁజేసి, తేని కావస్తుతతిని సమర్పించెను.

అంత వీరవేంకటపతి మహారాజును వసుమంతు నత్యాదరమున సభాముఖమున గౌరవింపుచు, వజ్రపుకంకణములను, రవలయుంగరములను, దానె స్వయముగ నాతని హస్తములకుఁ దొడిగియు, వజ్రాలహారమును గంఠమున వేసియు, మంచిముత్యములుగల పోఁగులజోడుచే నలంకరింపఁజేసియు, కట్టువర్గము లిచ్చియు, సభికుల హర్షకరతాళధ్వనులు

చెలరేఁగ, నెంతయు యింద్రవైభవముతో బహూకరించుటయే గాక, యాతనికి వర్తకమంత్రిపదవి నొసఁగి గౌరవించి, యాతని మిగుల నానందింపఁజేసెను.

వసుమంతుఁడు పారీసుపట్టణమున నుండిన కాలమునందు విద్యార్థిగా నుండి, వసుమంతుని పరిచితి నొంది యాతనివలన భరతఖండస్థ సంపదలను నిచటి వర్తకసౌకర్యములను దెలిసికొనిన, 'క్లాడరు' అను నాతఁడును, నాతనికి సపర్య లొసరించిన 'రిష్లూ' అను నాతఁడును, రాజ[illegible]ాద్యోగముల వృద్ధినొంది పిమ్మట 'పరాసు' దేశచక్రవర్తి యగు పదు[illegible]ఁడవ 'లూయీ' కడ మంత్రులై (క్రీ. శ. 1640 సం॥రం) భరతఖండములోఁ దమ దేశీయులు వర్తకముఁ జేయుటకుఁ జక్రవర్తిచే ననుమతింపఁ జేసిరి. అదియె, ఫ్రెంచివారి యీస్టిండియా కంపెనీ నిర్మాణమునకును, పిమ్మట వారీ భరతఖండమునఁ గొన్ని వలసభూములు సంపాదించుటకు హేతు వయ్యెను.

## శ్రీశైలమల్లికార్జునుఁడు.

మగధదేశము మహాభారతకాలమునుండియుఁ బ్రఖ్యాతినొందిన జరాసంధాది 'బార్హద్రథ' భూపాలురచేతను, ప్రద్యోతనాది 'శౌనక' రాట్టులచేతను, బింబిసారాది 'శైశునాగ' నృపులచేతను, మహాపద్మాది 'నంద' సమ్రాట్టులచేతను, చంద్రగుప్తాది 'మౌర్య' చక్రవర్తులచేతను, పుష్యమిత్రాది 'శుంగవంశ' పృథ్వీపతులచేతను, వసుదేవాది, 'కాణ్వాయన' భూపతులచేతను, సింధులా 'ద్యాంధ్ర' ప్రభువులచేతను పాలింపఁబడి, నాలవ క్రైస్త శకారంభమునందు, గుప్తవంశనృపుల వశమయ్యెను.

ఆగుప్తసమ్రాట్టులలో 'సముద్రగుప్తుఁడు' విద్యాపరాక్రమ-పరిపాలన-కవి పండితాదరణ-వైదిక కర్మాచరణాదులచే, సత్ప్రసిద్ధినొందెను. సముద్రగుప్తుని దిగ్విజయములనే యాతని కాలమునందుండిన 'కాళిదాస

మహాకవి' రఘువంశ మహాకావ్యమునందు 'రఘుదిగ్విజయ' మను మిషతో వర్ణించెనని కొందఱు పండితులు తలంచుచున్నారు.

సముద్రగుప్తుఁ డవసానదశయందు, పుత్రుఁ డగు చంద్రగుప్తునకుఁ, దన సామ్రాజ్యమును, సూర్యుఁ డస్తమయసమయమునఁ దన తేజము నగ్ని కొసఁగిన ట్లొసఁగెను. ఆచంద్రగుప్తుఁడును దండ్రికంటె నెక్కుడు పరాక్రమముతో శత్రురాజుల నోడించి, యువనతులఁ జేయుట యేగాక, దేశమునందు 'కఱవు, దరిద్రము, స్వచక్ర, పరచక్రభీతులు' లేకుండఁ జేసి, నిర్వక్ర పరాక్రమముతో దేశము సుభిక్షముగునట్లెక్కేండ్లు పాలించెను.

ఆచంద్రగుప్తచక్రవర్తికి, గుప్తవంశసాగరమునందు లక్ష్మివలె 'చంద్రవతి' యను నొక పుత్రిక జన్మించెను. సముద్రగుప్తసమ్రాట్పౌత్రియగు చంద్రవతి నల్లారుముద్దుగఁ బెంచి, తన కభిమానవిద్యలగు సంగీతసాహిత్యములఁ జెప్పించి, యావిద్యలలోఁ బ్రౌఢఁగాఁ జేసెను. ఆమె యౌవనారంభమున, 'విద్యుత్కాంతులడాలును, చంద్రప్రభల తళుకును' మేళవించి, బంగరునీటను బులుగడుగుచు, నలువ తన నేర్పరితనమంతయుఁ జూపుచు నొనరించిన స్త్రీజాతి ప్రథమ సృష్టివలెనే యుండెను.

చంద్రవతి చిన్నతనమునుండియు సంగీతవిద్యాప్రియురాలై, పూర్వజన్మసుకృతముచే సదాశివ భక్తపరాయణయై సఖీజనముతోఁ గూడి, గిరీశగాథాగీతికలనే బహువిధ వీణలచేత వివిధరసము లుప్పొంగఁ బాడుచుండును. పూర్వపుణ్య మెట్టిదో గాని, బాల్యమునుండియు నామెకు యోగాభ్యాసమునం దనురక్తియు సంసారసుఖమునందు విరక్తియు వైరాగ్యమునం దాసక్తియు నేకోత్తరాభివృద్ధి నొందుచుండెను.

పితామహునికడనే యామె పుట్టినది మొదలిరువదేండ్లు పెరుగుటచేతను, పితయగు చంద్రగుప్తుఁడు విదేశములలో బహుళరాజకార్యమగ్నుఁడై, రాజప్రతినిధిగాఁ గూడ నుండుటచేతను, నామె తండ్రికంటని పడలేదు. సముద్రగుప్తుఁడు స్వర్గస్థుఁ డైనపిమ్మట నొకప్పుడు, చంద్రగుప్తుఁడు తనకూఁతురియొక్క సంగీతసాహిత్య విద్యానైపుణ్యమును

వినీ, యీమె వీణాగానమును దిలకింపఁ గుతూహలుఁడై తన యంతిపురికిఁ జంద్రవతిని రావించి, నీసంగీతవిద్యానైపుణ్యము విన వేడుక కలదన, నామె పితృభక్తి మెయిఁ వీణానిక్వణమును 'కోకిల' కంఠముతో మేళవించి 'ఋషభ, మధ్యమ, గాంధారాది' స్వరగతులచే నవరసరీతుల గీతికలఁ బాడెను. వీణావాద్యమునఁ జూపఁబడు నామె యంగవిక్షేపాదులచేతను, గానమాధుర్యముచేతను, జంద్రగుప్తచక్రవర్తి, మనోభావమున మార్పుఁ గలుగ, ముగ్ధుఁడై, మూఢుఁడై, కామమోహితుఁ డయ్యెను. హా! యెంత విరుద్ధచర్య!

కూఁతు రగు సరస్వతిం గాంచి కామించినవాఁడు, బ్రహ్మయని పురాణములలో వినఁబడునే కాని, వేఱుచోటుల నిట్టి దౌష్ట్యము కాన్పింపదు. ఆయంశమైనను, 'సవిత' (సూర్యుఁడు) తనవలనఁ బుట్టిన యుషస్సును వెన్నాడుటను గాంచి, పౌరాణికులు సృష్టికర్త కూఁతును వెన్నాడినట్లుత్ప్రేక్షించి వ్రాసి రని పరిశోధకు లందురు.

ఎట్లయిన నేమి! లోకమునందు 'కనరాని, యనరాని, వినరాని' పాపపువిధమునఁ జంద్రగుప్తుఁడె ప్రవర్తింప నెంచెను.

కామమోహితుఁ డగు తండ్రిరీతిఁ గాంచి, చంద్రవతి సంగీతముఁ గట్టిపెట్టి యాభవనమును వీడి వేగమె స్వస్థలమునకుం జేరి సఖీజనులం గూడి యిట్లాలోచించెను.

"సఖియలారా! కాముకునకు యుక్తాయుక్త పరిజ్ఞానము సున్న. నాతండ్రి నన్నుఁ గనెను కాని చిన్నతనముననె నాతల్లి మృతినొందఁ బితామహునిచేఁ బెంపఁబడి తండ్రి కంటనైనఁ బడనైతి నందువల్ల నన్యగానో, సామాన్యనుగానో, నన్ను భావించి నాతండ్రి ముగ్ధుఁ డయ్యెను. పుత్రికాన్యాయమును గుర్తెఱుఁగఁ డయ్యె. హా! యెంతపాపకార్య మొనర్పఁ దలఁచెను! నే నీతని పుత్రికనై పుట్టినందుల కీతనికిఁ బశ్చాత్తాప మొనగూర్చి పాపవిముక్తుం జేయుటయే నావిధి" అని చెప్ప, నొకసఖి యిట్లనెను.

"చెలి! నీవేమి చేయఁగలవు? ఈవిపత్తుఁ జెప్పికొనఁ దల్లియైన నుండెనా? నీ తండ్రి చక్రవర్తి. మూర్ఖతచే, నసహ్యాదురితమును

బుత్రికావిషయముననే యొడిగట్టఁ దలఁచుట యస్మదాది స్త్రీజాతియొక్క దురదృష్ట” మనెను.

దానికిఁ జంద్రవతి యిట్లనెను.

'సఖి! నేను కామరోగగ్రస్తుఁడగు నీతనికామపిశాచమును పాఱ ద్రోల స్మరహరుం గూర్చియే తపం బొనరించెదను.'

అంత మఱియొక చెలి యిట్లనె.

'సోదరీ! అత్యాసన్న వివాహవయస్క వగు నీవు, కాశ్మీర ప్రభువునో, ప్రతిష్ఠానపురాధీశునో, ఉజ్జయినీవిభునో, వేఱొక చక్రవర్తినో పెండ్లియాడుదు వనియు, నీమహోన్నత మగు వివాహోత్సవముఁ జూచి యానందింతు నని యుఁ దలఁచుచుఁ దును; అది వ్యర్థమగుచుండినందులకుఁ జాల విచారింపుచున్నాను. మఱియు నీ వబలవు; ఎండకన్నెఱుఁగని సుకుమారిణివి, అట్టినీ వెట్లు 'కృచ్ఛ చాంద్రాయణాది' కఠినవ్రతము లొనర్చుచు, శీతాతప వాతబాధల కోర్చి, తపం బొనరింపఁ గలవు? దుర్ఘటకార్యము నొనరింపఁ దలఁచితివి. ఈప్రయత్నమును మాని యన్యోపాయము నాలోచింపు' మనెను.

అందులకుఁ జంద్రవతి 'సకియా! నాకెందులకో చిన్నతనము నుండియు, సంసారసుఖమునందు విరక్తియు, తపమునందాసక్తియు, శివునందు భక్తియుఁ గలిగియుండెను. అది నేఁటికీవిధమునఁ బరిణమించుట శుభసూచకమే యనుకొందు' నని చెలికత్తెయలను సమాధానపఱచి, భవిష్యత్కార్యమునకై యాలోచింపుచుండెను.

నాఁటిసాయంకాలముననకే చంద్రగుప్తునకు మిత్రుఁడుగా నుండిన పాంచాలదేశప్రభువు హఠాత్తుగ శత్రుఁడై చంద్రగుప్తుని రాజ్యములోని కొంతభాగము నాక్రమించె ననియు, వంగదేశపురాజా పాంచాలాధీశునకు మిత్రుఁడై, మగధదేశముపై దండెత్తుచున్నాఁడనియు రెండుభయంకరవార్త లొక్కకాలమున వినఁబడగానె, చంద్రగుప్తునకుఁ గ్రోధమున నొడలు తెలియక రసాంతరప్రవిష్టుఁడై చంద్రవతిని మఱచి యారాత్రియె దండును గూర్చుకొని దండయాత్రకు వెడలెను.

చంద్రగుప్తుఁడు పరదేశమున కేఁగిన మరునాఁడె, చంద్రవతియు,

మంచిసమయము చిక్కెనని సంతసించి యోగినీవేషమును ధరించి, తన వలె విరక్తలగు సిద్ధలు "సకియలు" శిష్యురాండ్రవేషముతో వెంటరాఁ బురమును వీడి దక్షిణాభిముఖయై, పోవుచు, దారిలో 'మహానదిని దాఁటి, మహేంద్రగిరిని జూచి, సింహాద్రిని దర్శించి, పిష్టపురమును దిలకించి గోదావరిని గ్రుంకులిడి, కృష్ణాస్రవంతి నతిక్రమించి' కతిపయదినంబులకుఁ బర్వతరాజమగు శ్రీశైలముఁ జేరెను.

శ్రీశైలమున జైన బౌద్ధమతములు, దక్షిణాపథమునందు రాజాదరణమతములై యుండుటచేతను, తన్మతప్రవిష్ట లగు 'యోగినులు' ప్రజలచే భక్త్యాదరములతోఁ గౌరవింపఁబడుచుండుటచేతను, యోగినీవేషధారిణులగు చంద్రవత్యాదులు మార్గమధ్యమునం బ్రజలచే నాదరింపఁబడుచు నిర్భీతిగఁ బ్రయాణము నొనర్పఁ గలిగిరి.

శ్రీశైలశిఖరముఁ జూచినంతమాత్రముననే, పునర్జన్మలేదని పురాణములు వాకొనుచుండ, దానిమహాత్మ్యము వేఱుగఁ జెప్పవలెనా? ఆశ్రీశైలమునం దనేక ఋష్యాశ్రమములు గలవు. అచటి వృక్ష దారు శిలా మృగాదులును, శ్రీశైలేశుఁ గొలిచి గొప్ప మహత్త్వ మొందిన యంశములు, పర్వతోత్పత్తికథ, మొదలగువానిఁగూర్చి స్కాందపురాణాంతర్గతమగు శ్రీశైలఖండము చెప్పుచున్నది. *

ఆశ్రీశైలగిరికిఁ జంద్రవతి చెలికత్తెలతోఁ బ్రదక్షిణ మాచరించి తత్తత్ క్షేత్రాదుల మహాత్మ్యములఁ దెలిసికొనుచు నొక్కెడ, నిండుభక్తితోఁ దప మాచరించి శివసాక్షాత్కార మొందిన యొకవృద్ధమునిసత్తముఁ గాంచి నమస్కరించి, 'మునివర్యా! నన్ను శిష్యురాలనుగాఁ జేకొని నేను శ్రీపర్వతేశ్వర సాక్షాత్కార మొందువిధము నుపదేశింపు' మని ప్రార్థించెను.

ఆ మహర్షియు నామె తలంపును దెలిసికొని యాదరించి పుత్రికాప్రేమతోఁ జంద్రవతికి 'శివపంచాక్షరి'ని యథావిధిగ నుపదేశించి తగుచోటునం దామె తప మాచరింప నిర్దేశించెను. ఒక్కొక్కని కొక్కొకవ్యక్తియం దిట్టి 'తారామైత్రి' కలుగునుగదా!

చంద్రవతియు గురునాజ్ఞ శిరసావహించి, [illegible] శ్రీపర్వ

తేశుఁ గూర్చి, మండు వేసవిని బంచాగ్నిమధ్యమునందును, వర్షకాలమునఁ గంఠదఘ్నజలమునందును, శీతసమయమున హిమసంహతియందును వసించుచు ఘోరతప మొనర్చెను.

ఇట్లు పెక్కేండ్లు తపం బొనరించినను, శంభుఁడు ప్రత్యక్షము కాకుండుటచే నన్యవిధమున దేవదేవు భజింపఁ దలఁచి, య[illegible]యాశ్రమమునఁ దనసఖియు లాదరముతోఁ బెంచిన తెల్లని మల్లికల [illegible]చే శ్రీపర్వతేశుని, శివసహస్రనామము లుచ్చరించుచుఁ బూ[illegible], శివుఁడు తాఁ ధరించిన గంగాస్రవంతి నిటఁ గూడఁ బ్రత్యక్షముగ ధరించెనో యనునట్లుండెను. కాని యందువలనను గూడ శివుఁడు ప్రత్యక్షము కాకుండుటకుఁ జంద్రవతి విచారించి, తనగానవిద్యాపాటవముచేతనె 'పశుపతి'ని వశపఱచుకొనదగునని నిశ్చయించుకొని శివనుతితోఁ గూడిన గీతికలను విపంచినిఁ గూర్చి పంచమస్వరమున గాన మొనర్చెను. ఆగానములోఁ జంద్రవతి సమయానుకూలములగు 'శ్రీ, నాట, సుర' టాదులగు నూటయెనిమిది స్త్రీపురుషరాగములను, బాంచాలాదిధ్వని చతుష్టయము నుప్పతిల్ల, మంద్రమధ్యాది తారకంబులు, వైదర్భ్యాదిరీతులు మెఱయఁ దనసంగీతవిద్యానైపుణ్యమును జూపెను.

ఆమె కంఠ మెత్తి వీణాతంత్రులను సారించి పాడుచుండఁగా, గానమహిమముచే మోడులు చిగిర్చెను; పాషాణములు కరుగుచు నీరయ్యెను, చిత్రరుపులు జీవములొంది తలలు పంకించెను; మృగములు మేతలు మాని స్తంభము లయ్యెను; ఆకసమునం దచ్చరలేమలు, కిన్నరకాంతలు, నిలిచి సంతసాశ్చర్యములతో నివ్వెరపడి చూచుచుండిరి. వేయు నేల? తుంబురనారదాదులు తాము కొంతకాల మామెకడ సంగీతవిద్య నభ్యసించిన మంచిదనుకొనిరి.

ఇట్లుండ, శ్రీపర్వతేశ్వరుఁడు స్థాణువు—భూతేశుఁడు—నైనను, సామగానలోలుఁ డగుటచేతను, నటరా జగుటచేతను, జంద్రవతీగానము

* ఈకథ సంస్కృతమునందుండిన శ్రీశైలమాహాత్మ్యమును, 'శేషసార్య' కృతమగు నాంధ్రశ్రీపర్వత పురాణమును జూచి వ్రాయఁబడెను. ఈగాథయే కుండితారాధ్యచరిత్రయందు సంక్షిప్తముగా వ్రాయఁబడెను.